## శ్రీ శ్రీ

# ఖడ్గసృష్టి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ సంఖ్య : 1360
ప్రతుల సంఖ్య : 2000
మొదటి ముద్రణ : ఫిబ్రవరి, 1966
రెండవ ముద్రణ : నవంబరు, 1978
మూడవ ముద్రణ : జూన్, 1977
నాల్గవ ముద్రణ : సెప్టెంబరు, 1982
ఐదవ ముద్రణ : మార్చి, 1986



వెల : రూ. 12.00

ప్రతులకు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం, గుంటూరు,
తిరుపతి, హనుమకొండ, అనంతపురం.

ముద్రణ:—
స్వామి గ్రాఫిక్స్
[illegible]
హైదరాబాదు—4

గరళపు ముద్ద లోహ మున
      గాఢ మహాశనికోట్లు సమ్మెటలో
హరు నయనాగ్ని కొల్మి ఊర
      గాధిపు కోరలు పట్టుకార్లు ది
క్కరటి శిరమ్ము దాయి లయ
      కాలుడు కమ్మరి వైరి వీర సం
హరణ గుణాభిరాముడగు
      మైలమభీమన "ఖడ్గసృష్టి"కిన్.

(వేములవాడ భీమకవి)

అంకితం

"తెలుగు వాడి"కి

# మహాకవి శ్రీశ్రీ రచనలలో
# మా ప్రచురణలు

| | |
|---|---|
| మహాప్రస్థానం | రు. 10-00 |
| ఖడ్గసృష్టి | రు. 12.00 |
| 1 + 1 = 1 మొదలైన రేడియో నాటికలు | రు. 10-00 |
| చరమరాత్రి | రు. 10-00 |


ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన్ భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

**విశాలాంధ్ర బుక్ హౌస్**
హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం, గుంటూరు,
తిరుపతి, హనుమకొండ, అనంతపురం

# విషయసూచిక

# ఖడ్గసృష్టి

రెండురెళ్ళు నాలుగన్నందుకు
గూంపాలు గండ్రాళ్ళు విసిరే సీమలో
క్షేమం అవిభాజ్యం అంటే
కైళ్ళు నోళ్ళు తెరిచే భూమిలో

అస్వతంత్రతని జయించడానికి
అహింసాయుధం ధరించామంటూ
రక్తపాతం లేకుండానే
రాజ్యం సంపాదించామంటూ

అవినీతి భారీపరిశ్రమలో
అన్యాయాల ధరలు పెంచేసి
స్వాతంత్ర్యాన్ని బ్యాంకుల్లో వేసుకుని
చక్రవడ్డీ తిప్పే కామందులకు

క్షణ క్షణం మారుతున్న లోకాన్ని
సరిగా అర్థంచేసుకున్న వాళ్ళంతా
పేద ప్రజల పక్షం వహించడమే
పెద్ద అపరాధమై పోయింది.

అహింస ఒక ఆశయమే కాని
ఆయుధం ఎప్పుడూ కాదు
ఆశయం సాధించాలంటే
ఆయుధం అవసరమే మరి.

ఆశయం ఉండడం మంచిదే కాని
అన్ని ఆశయాలూ మంచివి కావు
ఆశయాలు సంఘర్షించే వేళ
ఆయుధం అలీనం కాదు

అందుకే అంటున్నాను నేను
అందుకో ఆయుధం అని
ఆచరణకి దారితీస్తేనే
ఆవేశం సార్థకమవుతుంది.

అందుకే సృష్టిస్తున్నాను
అధర్మనిధనంచేసే ఈ ఖడ్గాన్ని
కలంతో సృష్టిస్తున్న ఖడ్గం ఇది
జనంతో నిర్మిస్తున్న స్వర్గం ఇది

ఈ కత్తి
బూజుపట్టిన భావాలకి
పునర్జయం ఇవ్వడానికి కాదు
కుళ్ళిపోతున్న సమాజవృక్షాన్ని
సమూలచ్ఛేదం చెయ్యడానికి

దీన్ని
నల్లబజారు గుండెల్లో దించు
దీనితో
కల్లకపటాలను వధించు

ఇది
సమానధర్మాన్ని స్థాపిస్తుంది
నవీన మార్గాన్ని చూపిస్తుంది

ఈ కత్తి
ఊహాసమూహాల వ్యూహాలు పన్ని
వీరవిహారం చేస్తూ
రణక్షోణిలో
జనాక్షౌహిణులు కదలడానికి

అందుకే రాస్తున్నా నొకగీతి
చేస్తున్నా నొక హేతి
రావోయి లోనికి
సందేహం దేనికి ?

ఇది నిజం
నవధర్మం మానవధర్మం
అణవశక్తి కన్న
మానవశక్తి మిన్న

రావోయి రావోయి లోనికి
సంకోచం దేనికి
నను చూడగా ఇదేవేళ
నా మనః కార్మికశాల

క్రక్కేది భావాగ్ని సెగలు
క్రమ్మేది దావాగ్ని పొగలు

రావోయి రావోయి లోనికి
రాసేది రవ్వుష్ణ గీతి
చేసేది పవ్యుగ్ర హేతి

# శరచ్చంద్రిక

నవీన విశ్వవిద్యాలయాల్లో
పురాణ కవిత్వంలాగా
శ్రవణ యంత్రశాలల్లో
శాస్త్రీయ సంగీతం లాగా
ఇలా వచ్చేవేం వెన్నెలా ?
ఎలా వర్ణించను నిన్ను ?
మహా కవులు లోగడ చెప్పిందే
మళ్ళీ మళ్ళీ చెప్పాలా ?

    ఏదో శాస్త్ర భాషా జ్ఞానం
    ఇంతో అంతో ఛందస్సంపదా
    ఐదో పదో అలంకారాలు
    అరో, అందులో సగమో ఆవేశం

ఇలాంటివే ఏవో పోగుచేసి
ఇదివరకు నిన్నెప్పుడూ చూడనట్టు
ఇవ్వాళే కొత్తగా కనిపెట్టినట్టు
ఏమని వర్ణించను నిన్ను ?

    ఏది రాసినా ఏం లాభం ?
    ఇదివర కెవడో అనే వుంటాడు
    బహుశా ఆ అన్నదేదో నాకన్నా
    బాగానే అని వుండొచ్చు.

అలాంటప్పుడు మళ్ళీ
కలం కాగితం మీద పెట్టి
కళంకంలేని తెల్లదనాన్ని
ఖరాబు చెయ్యడ మెందుకు ?

అనాది నుంచీ నువ్వు
అంత మంది కవులకీ
ఉపాదేయ వస్తువుగా నిలిచి
ఉపకారం చేశావు

అలాగే నేనూ ఒకప్పుడు
రొమాంటిక్ ప్రవాహంలో పడి
అమాయకంగా నీ బ్యూటీ
అభివర్ణించాను వృత్తాలలో

ఇవాళ మళ్ళీ అలాగ
ఎలాగ రాయగలను నేస్తం ?
ఇరవయ్యో ఏడు నాకు మళ్ళీ
ఎలా వస్తుంది చెప్పూ ?

అంచేత నీ గురించి
అనవసరావేశాలు పెంచి
అన్యాపదేశంగానో లేదా
అర్థాంతరన్యాసంగానో

సొంత కోపాలేవో పెట్టుకొని
పంతాలూ పట్టింపులూ పట్టుకొని
ఎవరినీ ఈ వ్యవహారంలో
ఇరికించదలచుకోను నేను !

ఇంతకీ ఆవేశాల కేముంది ?
ఎవడి బతుకు వాడు బతుకుతున్నాడు
ఎంతగా ఎడం ఎడంగా ఉన్నా
ఎంతగా పైపై భేదాలున్నా
ఎంతగా స్వాతిశయం పెరిగినా
ఎంత బలం ధనం జపం పెరిగినా

అంతరంగం అట్టడుగున మాత్రం
అంతమందిమీ మానవులమే!

అందుచేత ఓ చందమామా!
అందమైన ఓ పూర్ణసోమా!
సముద్రంమీదా అరణ్యంమీదా
సమానంగా ప్రకాశించే సౌందర్యాభిరామా!

(అదిగో మళ్ళీ కవిత్వం—
అనుకున్నాను మొదటే నేను
వెన్నెల పేరెత్తితే చాలు
వెర్రెత్తిపోతుంది మనస్సు)

అన్నట్టు ఏమిటి చెప్మా
అందామని అనుకున్నాను
ఏమీలేదు ; ఏమీ లేదనే
ఇంతసేపూ చెబుతున్నాను.

చెప్పొచ్చిందేమిటంటే
చెప్పడానికేమీ లేదని!
అంతమందికీ అన్నీ తెలుసు
అదే మన అజ్ఞానం.

ఎవడో చెబితే వినే రోజులు
ఏనాడో వెళ్ళిపోయాయి
ఇంకా ఏవో చెప్పాలని
ఎందుకీ ఉబలాటం!

అసలు నిజం ఏమిటంటే
ఎవడికీ ఏమీ తెలియదు
ఇలా ఎందుకొచ్చామో
ఇక్కడెంత సేపుంటామో

ఇక్కడినుంచి వెళ్లేదెక్కడికో
ఎల్లుండి ఏ తమాషా జరుగుతుందో
ఎవ్వడూ చెప్పలేడంటే నమ్మండి
చెబితేమాత్రం నమ్మకండి !

కాళ్ళక్రింద భూమి
కరిగిపోతున్నప్పుడు
పూర్వంవేసిన పునాదులు
కదిలిపోతున్నప్పుడు
మనిషికీ మనిషికీ మధ్య
మాయపొరలు కప్పినప్పుడు
మనసుకీ మనసుకీ మధ్య
మంచు తెరలు కమ్మినప్పుడు

ఏ నక్షత్రానికి తగిలించాలి
ఈ మన విషాద శకటాన్ని ?
ఎవరు మళ్ళీ అతుకుతారు
ఈ విరిగిన జీవిత శకలాన్ని ?

అంతా అగమ్యగోచరం
అంతా అరణ్య రోదనం
ద్వేషం ఇచ్చే పర్సెంటేజి
ప్రేమం ఎలా ఇవ్వగలదు ?

కష్టపడి ఆర్జించిన స్వాతంత్ర్యం
గద్దలు తన్నుకుపోతాయి
కంచిమేక పాపం ఎప్పుడూ
కసాయివాణ్ణే నమ్ముకుంటుంది.

ఇంతకీ ఈ భూమికి
ఏ మాత్రం ఈడొచ్చిందని ?

సగటు మానవుడి వయస్సు
పదకొండో, పన్నెండో !

ఈ పుత్రాన్ని చూసి
ఎందుకలా నవ్వుకుంటావు
మబ్బుతునక జేబురుమాలు
మాటు చేసుకొని, జాబిల్లీ !

మానవుడు పెరుగుతున్నాడు
పరిసరాల సర్ధం చేసుకుంటున్నాడు
ప్రకృతి శక్తులను జయిస్తూ
ఘన విజయాలు సాధిస్తున్నాడు.

ఏదో నిరాశగా నేను
ఇంత సేపూ వాగాను కదూ ?
ఇంకో వేపునుంచి చూస్తే
ఎంత వెలుగు కనబడుతుందో !

ఏమో బహుశా త్వరలో
మీ ఇంటికే రావచ్చు మేము
స్వాగతం ఇస్తావు కదూ
ఆతిథ్యాని కష్టాలమే మేము

చంద్రమండలానికి ప్రయాణం
సాధించరాని స్వప్నం కాదు
గాలికన్న బరువైన వస్తువుని
నేలమీద పడకుండా నిలబెట్టలేదూ ?

పరమాణువు గర్భంలోని
పరమ రహస్యాలూ
మహాకాశ వాతావరణంలోని
మర్మాలూ తెలుసుకున్నాక

సరాసరి నీదగ్గరకే
ఖరారుగా వస్తాంలే
అప్పుడు మా రాయబారుల్ని
ఆదరిస్తావుకదూ నువ్వు:

చిరకాలం అజేయంగావున్న
ఎవరెస్టు ఇటీవలే లొంగింది
చికిత్స లేదనుకున్న వ్యాధులు
చిత్తగిస్తున్నాయి పరారీ
పదార్థ విజ్ఞానశాస్త్రం
అమోఘంగా వికసిస్తోంది
ప్రాణం స్వభావం ఏమిటో
పరిశోధనలు సాగుతున్నాయి

మహానదుల గమనాలను
మళ్ళించ గలుగుతున్నాం
ఉత్తర ధ్రువంలో వ్యవసాయం
ఒకప్పుడు జరిగి తీరుతుంది

సంహారం సంగ్రామం అంటే
జనంలో అసహ్యం పుట్టింది
ప్రశాంతంగా జీవించాలని
ప్రజలంతా ఆశిస్తున్నారు.

ఇదీ మా భూలోకం కథ
ఇదీ మానవుడి **Progress Report**
ఇందులో అతిశయోక్తు లేవీ లేవని
ఎవరైనా ఒప్పుకుంటా రనుకుంటా.

అంతా బాగానేవుందని
అంత సుఖంగానే ఉన్నారని
అన్నానంటే మాత్రం అది
అబద్ధమే అవుతుంది.

జనాభా లెక్కలు నాకు
సరీగా తెలియవుగాని
దరిద్రాల శాతం ఇంకా
చిరాకు కలిగిస్తూనే ఉంచి.

ప్రపంచం మొత్తంమీద
భయం పెత్తనం చేస్తోంది
ఇరుగువాడు పొరుగువాణ్ణి చూసి
ఎందుకో బెదిరిపోతున్నాడు.

ఇక్కడ మా భారతవర్షంలో
ఎక్కువగా కబుర్లేగాని
సమాజ స్వరూపం మార్చే
సాహసం కనిపించకుండా వుంది.

మొన్న నే ఆంధ్రరాష్ట్రం
పుట్టినరోజు పండుగ చేసుకొంది
పన్నెండు నెలల అభ్యుదయం
పర్యాలోకనం చేసుకొంది.

ఏడాదిలో ఏమవుతుంది
ఇంకా కొన్నాళ్ళాగమంది
చెల్లాచెదరైన తెలుగువారంతా
తెల్లబోయి చూశారు !

ఇవన్నీ చెప్పుకుంటూ
ఎందుకు నిన్ను విసిగించడం శశీ !
ఇప్పటికే ఆలస్యమయింది
ఇంతటితో విరమించనా ?

చంద్రునికో నూలుపోగన్న
సామెత వుండనే వుంది

తీసుకో ఈ దారంలాంటి
తేలికైన గీరాస్ని.

ఇంతకుముందే చెప్పావుగా
ఏమీ పెగల్లేదని—
ఇలాంటివెన్నో నువ్వు
ఇదివరకు వినేవుంటావు.

శరత్కాల గగనంలో
చందమామ కనిపిస్తే
సరదాగా కొంత సేపు
సంభాషణ సాగించా.

సంతాపం కొంత సేపు
సంతోషం కొంత సేపు
సాగించిన సంభాషణలో
సారాంశం మరేముంది ?

ప్రసంగవశాత్తూ ఏ
పగల్భాలు పలికానో
అసందర్భమైనా ఏ
అడ్డదారి తొక్కానో

వెనుక తిరిగి చూసుకొనే
అలవాటే లేదు నాకు
అరనిమిషం దాటేసరి
కదే నాకు గత శతాబ్ది.

కావున ఓ జాబిల్లీ !
రాబోయే యుగంలో
కాలక్షేపం చేద్దాం
కలుస్తావుగా మళ్ళీ ?

అప్పుడు బహుశా నాలో
అరాజకం పోతుందనుకుంటూ
ఇప్పుడు బాధిస్తున్న
హృదయవేదన లుండవనుకుంటూ

శాఖా చంక్రమణం మాని
చెప్పేదేదో సూటిగా
బల్ల గుద్దిన మాదిరిగ
కుండ బద్దలుకొట్టిన బాపతుగా

ఈ నీళ్ళు నమలడం లేకుండా
ఈ కాళ్ళు తడబడడం లేకుండా
స్పష్టంగానే కాకుండా శ్రావ్యంగా
స్వచ్ఛంగానే కాకుండా సమగ్రంగా
రాబోయే యుగంలో

గుండెలు విప్పి మాటాడుకుందాం—
మినహాయింపులు లేని క్షమాపణలు లేని
సౌందర్యవంతమైన ఆ స్వర్ణయుగంలో

ఎంచేతనంటే భవిష్యత్తుమీదే
ఎప్పుడూ నా నిఘా వుంటుంది
ఇవాళకంటే రేపే
ఎంతో బాగుంటుందంటాను నేను.

వెళ్ళు జాబిల్లీ వెళ్ళు
కవులను కదలించడం అంటే
కాలం డొంకంతా అమాంతంగా
కదిలించడమే అవుతుంది.

స్వయంగా నీతో మాట్లాడి
చాలా కాలమయింది
అందుకే అవ్యక్తంగా అయినా
ఆప్యాయంగా మాట్లాడుతున్నాం.

ఎలాగైనా నువ్వు మాకు
ఏకరక్త బంధువుడివి
నీతో కాకపోతే ఎవరితో
మా ఘోషలు చెప్పుకోవాలి?

వెళ్ళు జాబిల్లీ వెళ్ళు
ఎనిర్మలమైన నీ వెన్నెల కురిపిస్తూ
మనోహరమైన సంగీతం వినిపిస్తూ
ప్రయాణించు శశీ ప్రయాణించు

ఇదిగో మాట! ఈ ప్రపంచంలో
ఇంకా ఎందరో అభాగ్యు లున్నారు
పలకరించు వాళ్ళని చల్లగా
ధైర్యంచెప్పు వాళ్ళకి మెల్లిగా

ఆసుపత్రి కిటికీల్లోంచి నీ
కిరణాలను జాలుగా పంపించి
వ్యాధిగ్రస్తుల పాలిపోయిన కపోలాలను
జాలిగా స్పృశించడం మరచిపోకు.

జైళ్ళలో వున్నారు కొందరు
వాళ్ళని ఓదార్చక తప్పదు సుమా
నేరాలు చేశారు నిజమే
అందుకని అలక్ష్యంగా చూడకేం!

మురికి గుడిసెల్లో నివసించే
పరమ దరిద్రుల నుదుటి మీద
ఏ కన్నంలోంచో జాగా చేసుకొని
ఎలాగైనా పరామర్శ చేస్తావుకదూ?

ఇదిగో జాబిల్లీ నువ్వు
సముద్రంమీద సంతకం చేసేటప్పుడు
గాలి దాన్ని చెరిపెయ్యకుండా
కాలమే కాపలా కాస్తుందిలే.

# విషాదాంధ్ర

బాకాలు లాభంలేదు బాజాలు లాభంలేదు
ఎంత యీదినా ఏం ఫాయిదా ఎక్కడా తీరం కనపడదు
తలమాత్రం మీదికుంచి నిలువీత ఈదుతున్నాం
గమనం పిసరూ లేదు గమ్యం అసలే లేదు

పట్టాభిరామ స్వామిమీద ప్రమాణంచేసి చెబుతున్నా
అంతా గజీతగాళ్ళే మళ్ళీ అరగజం పురోగమనం లేదు
ఆవర్యప్రాయంగా అభినయిస్తున్నాం అయినా ఎవరూ మనల్ని
చూడ్రు
అరుస్తున్నాం గొంతు చించుకుని అయినా ఎవరూ విన్రు

మనలో కొంత మంది కవులు మధురంగా నిశ్వసిస్తారు
యతిప్రాసలు సరిపోతాయి పదాలు మజాగా పడతాయి
పౌరుషానికి లోటు లేదు ప్రశస్తికి కూడా డిటో
పద్యాలకి పళ్లు రాలవు చింతకాయలు చెట్టుమీదే ఉన్నాయి

ఈ గొంగళీ వయస్సు ఇరవై అయిదేళ్ళు
ఇంకా ఎక్కువే అనుకో ఎవడు చూశాడు లెక్కలు
తీర్మానాలూ ఉపవాసాలూ చేశాం ఖద్దరూ కేకలూ వేశాం
మోసుకొచ్చాం స్వరాజ్యమ్మూట మూట విప్పితే ఏమీలేదు

అరవింద ఘోష్టు ఆశీర్వదించాడు కదా
ముమ్మిడివరం బాలయోగి ఏమంటాడో
ఆంజనేయదండకం పఠిస్తేనో
అన్నట్టు సాయిబాబాకి మొక్కుకోకూడదూ

మహారణ్యంలో మధ్యాహ్నంలాగ ఒక స్తబ్ధత నిశ్శబ్దత
రాత్రిపూట వేట ముగించుకొని క్రూరమృగాలు నిద్రిస్తున్నాయి

ఖడ్గ సృ

మహారణ్యంలో మధ్యాహ్నంలాగ ఒక స్తబ్ధత నిశ్శబ్దత
రాత్రిపూట వేట ముగించుకొని క్రూరమృగాలు నిద్రిస్తున్నాయి
చిల్లరజంతువులు భయంతో ఎక్కడివక్కడ ఇరుక్కుపోయాయి
ఎప్పుడేనా ఒక పక్షి ఎగిరితే ఎక్కడో ఒక ఆకురాలి చప్పుడు

శిశువుకి దక్కని స్తన్యంలాగ ప్రవహిస్తున్నాయి గోదావరి నీళ్ళు
బద్ధలైన గుండెల్లాగా బీటలు వేశాయి పొలాలు
మన పరిశ్రమలు ప్రణాళికల్లోనే మన ప్రతిభ చాకిరీకి తాకట్టు
మనకో ఇల్లంటూ లేదు రచ్చకెక్కే రాద్ధాంతాలు

కొంగల్లారా జపం చెయ్యండి పిల్లి పఠించు మంత్రాలు
ఎలకల్లారా సభ జరపండి ఎవరు గంటకట్టాలని
ఇంకోమారు ఎగరవేద్దనక్కా ఈసారి అందవచ్చు ద్రాక్షపళ్ళు
కోతీ తీసుకురా త్రాసు పంపకం తెగదంటేము.

# విశాలాంధ్రలో ప్రజారాజ్యం

శక్తికోసమే నడు !
ముక్తికోసమే మను ! విముక్తికోసమే మను !
విశ్వశాంతి క్రాంతికోసమే మనస్సు లేకమై,
నడూ నడూ ! భయం గియం విడూ !

వేగుజుక్క వెలిగె మింటిపై
వెలుగురేఖ లవిగో కంటివా !
ఉదయ మెంతొలేదు దూరము
వదలిపోవు నంధకారము

జీవితాశలే
భావి జాడలోయ్
ప్రపంచజాతి శాంతి కాంతి బాటసారివై ॥నడూ నడూ॥

విరోధించువారు లేరులే
నిరోధించువారు రారులే
అస్తి నాస్తి భేదమేలరా ?
వాస్తవం వరించి సాగరా !

విశాలాంధ్రలో
ప్రజారాజ్యమే
ఘటించగా శ్రమించరా పరాక్రమించరా ! ॥నడూ నడూ॥

# మున్నుడి

చెవులు విప్పి మనసు విప్పి
కనులు విచ్చి వినవయ్యా

కేథలిక్కు కెన్నెడి
బోల్షివిక్కు మున్నుడి

అరువు లిచ్చి కరువు తెచ్చి
ఋణం పెట్టి రణం తెచ్చి
జనం ధనం ఇంధనమై
చరణ కరాబంధనమై

జనన జరా మరణ దురా
క్రమణల సంగ్రంథనమై

ఒకనా డోహో అని పిం
చుక తిరిగిన ధనిక వాద
మికపై వెగటై జిగటై

మరణంలో మశౌతుంది

వినవయ్యా కెన్నెడీ
విశాలాంధ్ర మున్నుడి

కేథలిక్కు కెన్నెడీ
జీవితమే నిన్నది

ఖావనలే మొన్నవి
క్యూబా ఏమన్నది
లావోస్ ఏమన్నది
కాంగో నిలుచున్నది

ఐసన్ హోవర్ చేసిన
మోసం తాలూకు అసలు
వేసం ఈనాడు

ఎగిరివచ్చి నిజం సైకి
లెక్కి వచ్చి జనం తిరుగు
బాటుచేసి ఆకలేసి
పిడికెడు కబాళం కావా
లని యడిగిన తరుణంలో

లుముంబాను తిన్నావు
కుటుంబాలు కొన్నావు

అమెరికాల కాలు విరిగె
ఆఫ్రికాకు నోరు తిరిగె
ఆసియాకు ఆశరగిలె
ఆస్ట్రో ఆఫ్రో ఏష్యన్
కాస్ట్రోలకు కనులు విరిసె

ఏమంటావ్ కెన్నెడీ
ఈ శ్రీ శ్రీ సన్నిధి
చంపేస్తానని నీకో
సందేహం ఉండవచ్చు
సర్దేస్తానని నీకో
సమాధాన ముండవచ్చు

నీ టాంకులు నీ బాంబులు

విమానాలు విధానాలు
శ్మశానాలు చూస్తాయి
ప్రశాంతినే హరిస్తాయి

నీ సలహాదారులతో
నీ కలహాచారులతో

పెంటగనుల తుంటరులను
వెంటబెట్టుకుని వస్తే

రాకెట్లను విసరుతాం
నీ కట్లను విప్పుతాం

జాకెట్లను సవరించి
పాకెట్లను సరిదిద్ది

నీ మతాన్నే నీ హితాన్ని
నీ గతాన్ని కెలుకుతాం
చీకట్లను తరుముతాం

నీ హిట్లరు పాతదనం
చావాలని కసరుతాం

విన్నావా కెన్నెడీ
శ్రీ శ్రీ శ్రీ మున్నుడి

# సదసత్సంశయం

౧

ఆలోలము లాలోచన
లేవేవో నాలోపల
ప్రాలేయచ్ఛాయలవలె
తారాడగ కోరాడగ

పేరు పేరు వరసలతో
పిలిచి ప్రశ్న వేస్తున్నా
ఈ తెగని సమస్యను ఛే
దించువారలెవరో అని

ఎన్నో సందేహాలూ
ఎన్నో సంతాపాలూ
జీవితంపు చిక్కుముడులు
విడవెంతగ సడలించిన

ఈ సృష్టికి ఏమర్థం
మానవునికి గమ్యమేది
ఒక సకలాతీత శక్తి
ఉన్నట్టా లేనట్టా

౨

నిరంతరం ఘోషించే
నీరనిధిని పిలిచినాను
ఆస్తి నాస్తి రూపమైన
ఆకాశము నడిగినాను

మహాకవుల గ్రంథాలను
మనసుపెట్టి పఠించాను
ప్రవ్రజితుల ముముక్షువుల
భావాలను స్మరించాను

యుగయుగాలు తరలెగాని
ప్రశ్న, ప్రశ్నలాగున్నదె
అలలు కదిసి ముంచి చనగ
శిలమాత్రం మిగిలినట్టు

జగదీశ్వరు డతడెవరో
అగపడితే బాగుండును
ఏమీ యిది స్వామీ అని
నిలవేస్తా కడిగేస్తా

౩

కవి హృదయపు కనుములలో
గర్జించిన పర్జన్యం
పెనుచీకటి తిరుగుబాటు
బీభత్సపు మెరుపుదాడి

కనుముందు చిత్రించే
గతిలేని జనాల బాధ
కడుపు తరుక్కొనిపోయే
కన్నీళ్ళ విషాదగాథ

కరువులలో వరదలలో
కటిక దరిద్రుల అవస్థ
కవితలోన కథలలోన
కట్టాలని తలచినపుడు

ఈ విశాల జగతినుంచి
ఏమిటి నే కోరినాను
ఒక జానెడు సానుభూతీ
ఒక దోసెడు తిరుగుబాటు

౪

జ్ఞానులు బోధిస్తూ బ్ర
హ్మానంద మవాఙ్మానస
విశదమనీ అనుభవైక
వేద్యమనీ నుడివినారు

జపంవల్ల తపంవల్ల
ప్రపంచాన్ని మరిచిపోయి
భగవంతుని ధ్యానంలో
పడిపొమ్మని పలికినారు

మంచి పెద్దలను కొలిచే
మానదండమట దైవం
ఈశ్వరు డొకడే సత్యం
ఇతర సమస్తం మిథ్యట

ఇంద్రియాలద్వారా మన
కీ సత్యం తెలియదంట
విశ్వాసం తప్ప మనకి
వేరే సాక్ష్యం లేదట

౫

అగుపించనిదేదో ఒక
ఆత్మ పదార్థం కలదట
అన్నీ పోవచ్చుగాని
అది మాత్రం చావదంట

నిప్పు దాన్ని కాల్చలేదు
ఛిందించగలేదు కత్తి
నీరు దాన్ని ముంచలేదు
గాలి దాన్ని పెకలించు

జన్మలనీ కర్మమనీ
చాలాదూరం వెళ్ళిన
ఆలోచనలన్నీ ఈ
ఆత్మచుట్టు అల్లినవే

ఏతదాత్మ సర్వేషాం
సర్వత్రా ఆవరించి
సర్వస్వం తానే ఐ
శాసిస్తుం దంట జగతి

పుణ్యపాప నిర్ణేతలు
నీత్యవినీతిజ్ఞ విజ్ఞు
లస్తి నాస్తి విచికిత్సకు
లంతమంది యేమన్నా

ఇది మాత్రం నే నెరుగుదు
నెంతమంది యేమన్నా
తథ్యం ప్రాణికి మృత్యువన్న
తప్పదు జీవికి వేదన

జడిగొల్పే దుఃఖంలో
తడియకుండ గొడుగులేదు
ఆనందాలన్నీ తుద
కంత మొందు నొక సమాధి

మనుజునిలో మరణ భీతి
మదిలో దుఃఖానుభూతి

ఆలోచన లన్నిటికీ
అంతర్యంతో పునాది

ఎవరయ్యా ఎవరువారు
ఈశ్వర పద జిజ్ఞాసువు
లెవరయ్యా ఎవరంటా
ఇదిపరలో ఎవరువారు?

ఉద్యోగపు ధర్మంలో
సద్యోగం హాశ్చర్యంలో
పిటతాటపు బ్రతుకు గడిపి
రిటైరైన పోలీసులు.

నిత్య నిధువనక్రీడా
నృత్యంలో అలసిపోయి
జవసత్వా లుడిగిపోయి
సాధువైన వేశ్యామణి

నైకానోకహ విహారి
కాకంవలె దుఃఖ రాత్రి
ఘూకంవలె సంచరించు
లోక ద్వేషాగ్ని శిఖి!

ఇంకా చెప్పాలంటే
ఎందరో మహానుభావులు
బ్రతుకునించి పారిపోయి
తమ వెనుకనె దాగువారు.

మరణ మహాసముద్రాన
జీవిత మొక ద్వీపంలా
తమపాలిటి శాపంలా
తలపోసే ఫిలోపర్లు

ఆహా మరి యింతేనా
అందమైన మన మనుగడ
మూడునాళ్ళ వింతేనా
జగమతుకుల బొంతేనా

మెదడన్నది మనకున్నది
అది సరిగా పనిచేస్తే
విశ్వరహః పేటికా వి
పాటన జరగక తప్పదు.

"ప్రవక్ష్యామి గీతార్థ
న" యన్నాడు కాళిదాసు
బహుశా అంతకుమించిన
* క్థోనిజమే ఉండదేమొ

ఔను - అహింసను పోలిన
పరమో ధర్మమ్ము లేదు
(పరమో ధర్మం విరుసకు
పరమ - అధర్మం అంటూ)

ఈవిల్, సిన్ మొదలైన ప
దాలను వాడే టప్పుడు
న్యాయం ధర్మం నీతి
త్యాదుల చర్చించేప్పుడు

ఎవరికి తోచిన అర్థం
వారలు చెప్పక తప్పదు
పరమార్థం సామాజిక
సామూహిక సద్వర్తన

---

* Chthonism—Humanism

౧౦

కలడు కలండనెడు వాడు
కలడో లేడో అంటూ
రోగడ ఒక ఏనుగు ఆ
లోచనలో పడిందంట

హోరా హోరీ మకరితో
పోరి నడుం జారి తుదకు
“నాన్యథాస్తి శరణ”మనుచు
దైన్యంతో నిలిచిందట

విహ్వల నాగేంద్రుని మొర
విని—అప్పుడు కదలెనంట
ఆపన్న జనావన బిరు
దాంచితుడైనట్టి వేల్పు

చక్రంబున నక్రంబును
సంహరించి ఆ పిమ్మట
స్థల జలచరు లిరువురికీ
సాయుజ్య మొసంగెనంట

౧౧

ఇది జరిగిన కథ కాదని
ఎవరో కల్పించిందని
ఇంచుక యోచించ గలా
డెవడైనా గ్రహిస్తాడు.

ఆ విషయ మటుండ నిచ్చి
అసలు సంగతికి వద్దాం
ఈ గజేంద్ర మోక్షణ కథ
ఏమిటి చెబుతుంది మనకు ?

నీ శక్తికి విలువ లేదు
నీ యత్నం పనికిరాదు
దైవబలం ఉండే అది
అమేయమూ, అజేయమూ!

అందుచేత చేతులెత్తి
లొంగిపొమ్మ బేషరతుగ
అపు డాతని కృపచేత స
మస్తం సౌఖ్యాంత మగును

౧౨

పిరికితనం నూరిపోయు
పిట్ట కథలతో బానిస
మానసికత నగ్గించే
మన పూర్వుల నేమనాలి?

రాచరికపు రోజుల్లో
ఎగుడుదిగుడు సమాజాన
పాలక వర్గాధిక్యం
నిలబెట్టే పూనికతో

మనిషి నిలా తగ్గిస్తూ
మరోదాన్ని ఉగ్గడించి
పరమాత్ముని పేర మత
ప్రవక్తలైనారు వారు

వాళ్ళ నెందు కనడంలే
ఇది మనలో జీర్ణించిన
ముది తత్వం, ఈ సరికీ
వదలిపోని మురికి మందు

(సశేషం)

# మహాసంకల్పం

ఇది నా స్వాతంత్ర్యదిన
మహా సంకల్పం.
విధిగా వికసించే
చరిత్రకొక కృతజ్ఞత,
ప్రజలకు నివాళి,
ప్రభవించిన నూతన భారత
పతాక కభివాదం,
భవిష్య దుజ్జ్వల
ధర్మయుగానికి ఆహ్వానం,
సకల జగజ్జనులారా
ఇదిగో నా స్వాతంత్ర్యస్వప్నం !

ఏ స్వాతంత్ర్యం నిమిత్తం ఎవరెవరో ఎందరో దేశసేవా
భాస్వంతుల్ బాలవృద్ధుల్ పతితు లధిక లప్రాజ్ఞుల్ప్రాజ్ఞులంతా
అస్వాశల్ వీడి లాఠీహతులయి ఉరికొయ్యల్ కవుంగింట చేర్చా
రా స్వాతంత్ర్యం లభించిందని విని హృదయం హ్లాద సంపుష్టమైతే

నవోదిత స్వాధీనతానందితోత్ఫుల్లమైన
నగరం జెండాల పంటలతో నవ్వుతూ పాడుతూఉండే
ఉత్సాహ ప్రవాహంలో నేనూ ఒక బిందువునై
స్వాతంత్ర్య వాయువులు పీలుస్తూ సాగిపోయా

ఆ సమయంలో అందరి మనస్సు
లావరించె నొకవ్యక్తి
అందరిలోనూ ఆ సమయంలో
ఆవహించె నొక శక్తి

అంతట్లోకే అకస్మాత్తుగా
జన సందోహం కరిగి
ఒకే వ్యక్తిగా రూపుధరిస్తే
ఇదేం చిత్రమని చూశాను.

ఒక పెద్ద కాంస్య విగ్రహా
నికి ప్రాణం వచ్చినట్లుగా,
ఒకే మేఘం గగన పథం దిగి
మానవుడై నిలిచి నట్లుగా,
ఒక మహా వట వృక్షం
హఠాత్తుగా నడిచినట్లుగా,
ఒకే ఒక్క మానవమూర్తి
నా కళ్ళముందు కనిపించాడు
ఎంచేతో అతని ముఖం మీద
ఎప్పుడూ ఉండే పసిపాప నవ్వులేదు ?

ఆ మానవాననంలో
ఏదో కించిద్విషాదం, కించిన్నిరాశ
కొంచెం విరాగం, కించి దసంతృప్తి,
ఆ మానవ వదనం అందరికీ పరిచితమే,
అతడే నువ్వూ, నేనూ అంతమందీ వెరసి.

స్వతంత్ర భరతవర్ష వాస్తవ్యు డా మానవుడు
అర్ధనగ్నంగా ఆకాశాన్నే కప్పుకొని
నిండని కడుపుతో మండుతూన్న కళ్ళతో
ఇలా ఎంతకాలం నిలబడతా డా ప్రాణి ?

అతణ్ణి జాగ్రత్తగా చూడండి
స్వతంత్ర భారత పౌరుడు,
అతని బాధ్యత వహిస్తామని
అందరూ హామీ ఇవ్వండి.

అతని యోగక్షేమాలకు
అంతా పూచీ పడండి,
అతికించండి మళ్ళీ
అతని ముఖానికి నవ్వు!

స్వాతంత్ర్యం ఒక చాలా సున్నితమైన పువ్వు,
చాలా వాడైన కత్తి, విలువైన వజ్రం
స్వాతంత్ర్యం తెచ్చే వెన్నెన్నో బాధ్యతలు
సామర్థ్యంతో నిర్వహిస్తామని

సంకల్పం చెప్పుకుందాం!

భగవంతుని ప్రార్థించిందికి
బహుశా ఇది సమయం కాదు,
పాతవి గుంజాళించిందికి
బహుశా ఇది సమయం కాదు.

ఇది మనకొక దీక్షాసమయం
ఇది మనకి పరీక్షాసమయం
ఆవేశం ప్రకటించిందికి
అసలే ఇది తరుణం కాదు —

రా! నేస్తం, పోదాం! చూదాం
మువ్వన్నెల జండా పండుగ;
రా! నేస్తం, లేదాం! చూదాం
మన భారతజన సౌభాగ్యం.

అటు చూడు సముద్రం, నేస్తం
హర్షానికి పర్యాయపదం:
ఇటు చూడు విహాయస క్షేత్రం
దుఃఖానికి అధ్యాహారం:

ఈ రెండింటిమధ్య నిలిస్తే
నీ లోపల లోలో పలికే
ఆలాపన లాలోకిస్తే
వినపడదా ఒక సంగీతం,
విడివడదా ఒక సందేశం!

ఇదీ నా స్వాతంత్ర్యదిన
మహా సంకల్పం.
ఇది నా ప్రజలకు నివాళి
స్వతంత్ర భారత పతాకాని
కిది నా అభివాదం,
భవిష్య దుజ్జ్వల
ధర్మయుగానికి ఆహ్వానం,
సరిహద్దులు లేని
సకల జగజ్జనులారా!

మనుష్యుడే నా సంగీతం,
మానవుడే నా సందేశం!

# 'కోఈ హఁస్ రహా హై'
# 'కోఈ రో రహా హై'

ఒక మనిషి బ్రిడ్జిమీద నడుస్తూ జేబులోని చిల్లర డబ్బులు బిచ్చగాడి కిచ్చేస్తాడు; రిస్టువాచీని ఎదురుగుండా వస్తూన్న నర్సు కిచ్చేస్తాడు; కోటుతీసి నీళ్ళలో పడవేస్తాడు; దాని వెనుకనే నీళ్ళలో పడిపోతాడు

ఒక మనిషి వ్యాపారం పారం కనుక్కొంటాడు; వాడి చేతుల్లో రూపాయల చెట్లు మొలుస్తాయి. అవి బ్యాంకుల్లో బంగారపు గుడ్లు పెడతాయి; వాటిలోంచి కన్నీరు సొనగా కారుతుంది.

ఒక మనిషి మైలురాయి దగ్గర మౌనంగా కూర్చుంటాడు; అనుక్షణం ఎవరో వస్తూన్నట్లు నిరీక్షిస్తాడు; బస్సులు లెక్కపెడుతూ బఠానీగింజలు తింటూ వుంటాడు; మేఘాన్ని చూస్తూ కాలాన్ని మరిచిపోతాడు.

ఒక మనిషి నిచ్చెనలు మోసుకుంటూ తిరుగుతాడు—సంచీలో బాతుగుడ్లూ వాడూను; గోడకి నిచ్చెన చేరవేస్తాడు; నిచ్చెన ఎక్కి బాతుగుడ్లు ఆకాశంమీదికి విసురుతాడు; అంత ఎత్తు బంగారానికి హరిశ్చంద్రుణ్ణి కొనుక్కొన్న అసామీ వీడే.

ఒక మనిషి రంధ్రాల్ని అన్వేషిస్తాడు; వాటి సైజుల్లో భేదం ఉంటుంది.

ఒక మనిషి అరాజకాన్ని అమ్మజూపుతాడు; దీర్ఘబాహువుల్లో పేన్ని దేవుతున్నట్లే వుంటాడు; యువకుల హృదయ రక్తకాసారాల్లో దొరికే గజనిమ్మ పళ్ళు తప్ప మరేవీ తినడు; అదైనా రోజుకి ఒకసారి మాత్రం.

ఒక మనిషి కాంభోజరాగం పాడుతూ కాలాన్ని వెళ్ళపుచ్చుతుంటాడు; వాడిదగ్గర ఒక విపంచికూడా ఉందన్న సంగతి యిక్కడ జ్ఞాపకం చెయ్యక పోవడం అనవసరం; ఆ వేళల్లో ఆలాపించే రాగాల్ని శాసించడానికే ఆ వేళ్ళు; వాటి స్పర్శకి నక్షత్రాలు అంటుకుంటాయి; చంద్రుడిలో సరస్సులు సలసల కాగుతాయి; నా గుండెల్లో చలికాలం చివురు తొడిగి సీతాకోక చిలకతో పెళ్ళి మాటలు ప్రారంభిస్తుంది.

ఒక మనిషి కర్పూరం, కళ్ళకి, సింధూరం చెక్కిలకి రాసుకుంటాడు; పూసుకుంటాడు; వాడొక కవి. రహస్య భాషలో అందుకున్న సందేశాలని వ్యాఖ్యానం చేస్తూ విమానశాఖలో పనిచేస్తాడు; బజారు ధరలు పడిపోతూండడానికి వాడే గొప్పకారణం.

ఒక మనిషి రుద్రాక్ష తావళాలు మెడిలో వేసుకొని జపంచేస్తూ వుంటాడు; బొజ్జతో ఆలోచిస్తాడు; వాడిముందు కొబ్బరికాయలు కొట్టొద్దు మొర్రో అని నేను మొత్తుకోవడంవల్ల ప్రయోజనం లేదని తెలిస్తే మాత్రం ప్రయోజనమేమిటి?

ఒక మనిషి ఒక్కత్తెనే ప్రేమిస్తాడు; ఆమె చచ్చిపోతుంది; తరువాత కధ తెరమీద చూడండి.

ఒక మనిషిని ఉరితీసేస్తారు: వాడి చావులో శాంతిని కొనుక్కుంటుంది సంఘం; న్యాయశాస్త్రం తృప్తిగా నిట్టూరుస్తుంది; వాడి నెత్తురు చిందినచోట ప్రతి సాయంత్రం ఒక కన్నులేని కుక్కపిల్ల జాలిగా మొరుగుతుంది; తన్ను అన్యాయంగా ఉరితీశారని చెప్పడాని కిష్టంలేనంత గర్వం ఆ మానవుడికి.

ఒక మనిషి ఉపన్యాసాలిచ్చి గొప్పవాడవుతాడు; ఒక మనిషి చిత్తుగా తాగేసి బీదవాడవుతాడు; ఒకడు దొడ్డమ్మ దగ్గర కానీ తీసుకొని గాలిపడగ కొనుక్కుంటాడు, ఇంకొకడు దాన్ని లాక్కుంటాడు.

ఒక మనిషి పరారీ అయిపోతాడు; వొకడు పూనాకి పోతాడు; ఒకడు పెళ్లాడేస్తాడు; ఒకడు పడుక్కుంటాడు; మరొకడు కునికిపాట్లు పడతాడు; ఇంకొకడు బాతాఖానీ కొడతాడు; ఒకడి ఏడుపుకి నవ్వొస్తుంది; ఒకడి నవ్వు ఏడుపు తెప్పిస్తుంది: ఉదాహరణలతో సహా ఇది నేను ఋజువు చెయ్యగలను.

అండజ భీము డండడడ డండడ డండడ డండ డండ డండండడ డండ డండ డడ డండడ డండడ డండ డండ...స్వామీ దీని కంతమెప్పుడు?

శిష్యు: ఇది అనంతం.

# గాంధీజీ !

మరచిపోయిన సామ్రాజ్యాలకు
చిరిగిపోయిన జెండా చిహ్నం
మాయమైన మహాసముద్రాలను
మరు భూమిలోని అడుగుజాడ స్మరిస్తుంది

శిథిలమైన నగరాన్ని సూచిస్తుంది
శిలాశాసనం మౌనంగా
ఇంద్రధనస్సు పీల్చే ఇవాళటి మననేత్రం
సాంద్రతమస్సు చీల్చే రేపటి మిణుగురు పురుగు

కర్పూర ధూమధూపంలాంటి
కాలం కాలుతూనే వుంటుంది
ఎక్కడో ఎవ్వడో పాడిన పాట
ఎవ్వడో ఎందుకో నవ్వేపాప

బాంబుల వర్షాలు వెలిసిపోయాక
బాకుల నాట్యాలు అలసిపోయాక
గడ్డిపువ్వులు హేళనగా నవ్వుతాయి.
గాలి జాలిగా నిశ్వసిస్తుంది.

ఖడ్గాన్ని రద్దుచేస్తుంది ఖడ్గం
సైన్యాన్ని తినేస్తుంది సైన్యం
పొలంలో హలంతో రైతు
నిలుస్తా డివాళా రేపూ

ప్రపంచాన్ని పీడించిన పాదుకలని
ప్రభాత నీరజాతంలో వెదకకు
ఉత్పాతం వెనుకంజ వేసింది
ఉత్సాహం ఉత్సవం నేడు

అవనీమాత పూర్ణగర్భంలా
ఆసియా ఖండం ఉప్పొంగింది
నవప్రపంచ యోనిద్వారం
భారతం మేలుకుంటోంది.

నేస్తం మనదుఃఖాలకి వాయిదావేద్దాం
అసౌకర్యాలు మూటకట్టి అవతల పారేద్దాం
ఇంకోమాటు వాగ్వాదం ఇంకోనాడు కొట్లాట
ఇవాళ మాత్రం ఆహ్లాదం ఇవాళ తురుఫాసు

# మంచి ముత్యాల సరాలు

ఎర్రకాలువ కప్పుకొని మా
ఇంటి కొచ్చిందొక రివాల్వర్
బాధలో బెంజైన్ సీసా
ప్రేమలో డైమన్‌రాణి.

మెడకి కాంచనమాల చక్కని
జడకు చుట్టిన పుష్పపల్లి
చావుబతుకుల జమిలిదుప్పటి
కప్పు కొచ్చింది.

ప్రేమగానం మోసుకుంటూ
మహాశంఖం మాటలాడదు
ఐంద్రకార్ముక మంత్ర బర్హం
మబ్బుచాటున మాయమైనది!

పాతపీపా పీతపాపా
పాడుకుంటూ తిరుగుతాయట
కొత్త గొంతుక చెవిని పడితే
గుడ్లు నిప్పులు చెరుగుతాయట.

నేను వెళ్ళిన నాటినుంచీ
నీడలోపలి మేడ దిగదట
కోడిగుడ్డు ప్రమాణకంగా
కృష్ణశాస్త్రిని చదవలేదట.

నన్ను తిట్టిన తిట్లతోనే
మల్లెపూవుల మాలకట్టెను
నాకు వ్రాసిన ప్రేమలేఖలు
పోస్టుచేయుట మానివేసెను.

వెయ్యావాచ్చిప్పలని మేసిన
వెర్రికుక్కకి గాలివాన
రోలు చెప్పిన కథకి పాపం
డోలు కించిక పైనమైపడి

ఒరి కూపస్థ భల్లూకం
గోడపై రుద్రాక్షపిల్లి
ఆటలోపం అరిటిపండు
పాటి లెంచకురా.

ఎగురుతున్నాయ్ ఇసపకోటలు
పగులుతున్నాయ్ పాతపాటలు
రగులుతున్నాయ్ రాచబాటలు
రాజుకోవేరా.

ప్రేమకి సింహాసికి ఒక
జారుముడితో చాలు పోరా
నిన్ను తిట్టేవాళ్ళకోసం
కళ్ళు విప్పుకు నిద్రపోరా.

ఇదే నా కడసారి సలహా
ఇలా తే నీ మనీపర్సుని
ఆంధ్రపత్రిక కప్పుకొని కా
రడవి కేగిం దా రివాల్వర్.

నేడు నా కంట్లో సివంగులె
నిద్రలో నిలిచే ఫిరంగులు
కాళ్ళు చుట్టూ కపాలాలే
కావ్యగీతి కలాపాలు.

# ఏవి తల్లీ!

## (THE SNOWS OF YESTER YEAR)

(F Villon అనుసరణము)

చక్రవర్తి అశోకుడెచ్చట ?
జగద్గురు శంకరుండెచ్చట ?
ఏవి తల్లీ ! నిరుడు కురిసిన
హిమ సమూహములు ?

కాళిదాస మహా కవీంద్రుని
కవన వాహినిలో కరంగిన
ఉజ్జయిని నేడెక్కడమ్మా
ఉంది ? చూపించు ?

షాజహాన్ అంతఃపురములో
షట్పదీ శింజాన మెక్కడ!
ఝాన్సి లక్ష్మీదేవి యెక్కిన
సైంధవం నేడేది తల్లీ?

రుద్రమాంబా భద్రకాళీ
లోచనోజ్జ్వల రోచులేవీ !
ఖడ్గతిక్కన కదనకాహళ
కహకహ ధ్వను లెక్కడమ్మా?

ఎక్కడమ్మా కృష్ణరాయని
బాహు జాగ్ర ద్భుడదాగిన్నలు?
బాలచంద్రుని బ్రహ్మనాయని
ప్రాణవాయువు లేవి తల్లీ?

జగద్గురువులు, చక్రవర్తులు,
సత్కవీశులు, సైన్యనాథులు,
మానవతులగు మహారాజ్ఞులు
కానరారేమీ?

పసిడిరెక్కలు విసిరి కాలం
పారిపోయిన జాడలేవీ?
ఏవి తల్లీ! నిరుడు కురిసిన
హిమ సమూహములు?

# సామాన్యుని కామన

## ౧. సామాన్యుని వాస్తవికత

ఈ రోజున సామాన్యుడు
ఏమీ లేనట్టివాడు
కూడూ గూడూ గుడ్డా
ఎమి లేనట్టివాడు
చదువూ సామూ శాస్త్రం
ఏమీ యెరుగని వాడు

ఈ రోజున సామాన్యుడు
సగం దేవతాంశ, సగం
రాక్షసాంశ, సగటున ఈ
సామాన్యుడు మానవుడు

అంటే నీవూ నేనూ
ఆమె ఈమె వీడు వాడు
అంతా సామాన్యులమే
సగం వెలుగు సగం నీడ
సగం ఋతం సగ మనృతం
సగం అడ సగం ఈడ
సగం పశువు సగం నిసువు
ఈ వెల్తురు ఈ చీకటి

ఈ యిరులూ ఈ వెలుగూ
వేరు వేరు గదులు కావు
ఒకటే రెండుగాకూడా
ఇపుడు నిప్పు ఇపుడె పువ్వు

ఇప్పుడు దూసిన ఖడ్గం
ఇంతట్లో కౌగిలింత
ఒక క్షేత్రం కల్హారం
మరో రన్ను కర్పూరం

మూడో కంటి వాడంటూ
లేడంటే సమ్మృలాప్
మాదనోయి నీలోకి నీవు
ఒకటి రెండు వెరసి మూడు

నరకం స్వర్గం అన్నవి
ఒక స్థితికే రెండు పేర్లు
ఫోకస్ బేవం అంతే
లోపస్ రెండిటి కొకటే

శ్రీ అనగా లక్ష్మి, సరే
శ్రీ అంటే విషంకూడా
శ్రీశ్రీ సిరి చేదు లేక
సిరీ సిరీ, చేదు చేదు

మీ యిష్టం శ్రీకారం
గుణకారం చేసుకోండి
మీకే అర్థం తోస్తే
ఆ **key** నే వాడుకోండి

ఒకటే శ్రీ అదే రెండు
అదే చేదు సిరి అదే
అమరత్వం అసురత్వం
శ్రీశ్రీ ఒక మానవుడు

**నేపథ్యంలో :**

**నీ మూసిన పిడికిటిలో**
**ఏమున్నది కవీ కవీ**

ఆ దాచిన పళ్ళెంలో
ఏం తెచ్చావ్ సుకవీ
ఆ మూలని సంచీలో
ఏమున్నది చెపికవీ
    మూసిన గుండెల్లో
ఏం దాచావ్ సుకవీ

ఏ పాడని పాటలలో
రాపాడే దేదికవీ
ఆ కొసలో నిదలలో
ఏ సత్యం సుకవీ

ఏ సత్యం ఏ స్వప్నం
ఏ స్వర్గం సుకవీ
మా కోసం ఏ కోసిన
వే కావ్యాల పూజ కవీ

## ౩ సామాన్యుని కామన

సైన్యంవల్ల ఈ రోజున
సామాన్యుని బ్రతుకుకూడ
సౌందర్యమయం కాగల
సదుపాయం లభించింది

జన్మం చర్మం వెనకటి
సంప్రదాయమూ ఇప్పటి
సంఘస్థితులూ నెరపే
అసమానత పనికిరాదు

ఐశ్వర్యం అందరిదీ
అందుచేత అందులోన
సామాన్యుడు తన వాటా
తనకిమ్మని కోరుతాడు

బతకడమే సమస్యగా
పరిణమింప జేసినట్టి
అన్యాయాలన్నిటిని
హతమార్చాలంటాడు.

ఇదేం పెద్ద గగనమా? మ
రిదేం గొప్ప కోరికా? ఇ
కేం? ఇదొక్క విప్లవమా?
ప్రశ్నిస్తే పాపమా?

యుగసంధిది, సామాన్యుని
శకం దీన్ని కాదనరా
దిది రేపొచ్చే వ్యవస్థ
కివాళనించీ, పునాది
ఇప్పటినించీ నాంది.

అంతే, ఇంతే స్వప్నం:
అన్నీ ఒక్కడికి బదులు
అంత మందికీ అన్నీ!
అదే స్వర్గమంటాను.

ఆ స్వర్గం వేరే కడు
దూరంలో లేదు లేదు
ఈడే నేడే వున్నది.
నీలో నాలో వున్నది.

మీ యిష్టం ఈ ధాత్రిని
చేయవచ్చు స్వర్గంగా
చీల్చవచ్చు నరకంగా
ఏంచేస్తారో సరిపరి యిక మీ యి

# రుబాయత్

**Charlie Chaplin, Joseph Stalin**
**Walt Disney, Georges Hunnet**
**Greta Garbo, Pirandello**
ఇటీవల మా **inspiration.**

**Sigmund Freud, Harold Lloyd**
**Albert Einstein, Jacob Epstein**
హారీన్ వట్టో, గిరాం మూర్తి.
ఇటీవల మా **inspiration**

కధాకాలీ కూచిపూడీ
జావా నాట్యం, **Russian Ballet,**
**Jazz, Rumba, Carioca**
మాషోరిస్తాయ్, నిషా చేస్తాయ్.

**Don Bradman Mohan Bagan**
**Walter Lindrum, Vines, Cochet**
కొంచెం **carroms,** కాస్త **Pin-pong**
ఒక **cup** కాఫీ, ఒక పఫ్ **cigarette**
తమాంషుద్.

# భ్రమరగీత

[శాంతిలో అశాంతి అశాంతిలోనే శాంతి అనుభవించగలడు శ్రీశ్రీ]

గిరగిరగిరాం
భ్రమరం
గిరాం భ్రమణం
భ్రమం
'భ్రమరణం'
భ్రమణ భ్రమరం
భ్రమర భ్రమణం
గిరగిర గిరాగిరాగిరాం భ్రమణం
రణం
మరణం
రణమరణం దారుణహననం
ధిషణానిధనం
వృథామథనం
అది నా చెవిలో ఝషనం
శోకకథనం
రుదనం
రుదన కథాకథనం
అది నా యెదలో రణనం
ఝణ ఝణ ఝుంఝుణ ఝణాఝణా నిక్వణనం
అది నా నయనంలో ప్రథ మారుణ కిరణం
రణ నిస్సృహణం
పథా విధా నాచరణం
నాతో లోలోపల భ్రమా భ్రమర సంచరణం
రణద్రణ నిస్సృహణ ప్రణవం
అది నా హృదయంలో రుధిరజ్వలనం గీతాజననం !!!

# బొమ్మలాంతరు

దిదుతూన్న గుంట ఓనమాలు చెరిపేసి
చేతిలో ఉన్న బలపం విరిచేసి
కొత్తపలక కొనుక్కొచ్చాడు కుర్రాడు

పొగాచుట్టుకొంటూన్న రోకలి పారేసి
తెలివితక్కువ తనాన్ని గొయ్యితీసి పాతేసి
పొరుగువాడెలా ఉన్నాడని భోగట్టాచేశాడు వెర్రాడు

ఆడుతూన్న నాటకం ఆపేసి
పెట్టుకున్న గడ్డం కుళ్ళాయీ లాగేసి
ఆడియన్సులో కలిసిపోయాడు విదూషకుడు

నిన్నటి వాగ్దానాన్ని నేటి ఉపన్యాసంలో కాల్చేసి
నేటి ఫోర్జరీని రేపటి సంతకంగా మార్చేసి
ఇక్కడే వుండు వొస్తానని ఎక్కడికో పోయాడు వినాయకుడు

తన చుట్టూ తాను తిరుగుతూ
సూర్యుడిచుట్టూ పరిభ్రమించే భూమిలాగ
ఆశయంచుట్టూ తిరుగుతోంది ఆవేశం.

(చీట్లాటలో ఒక చేతిని అన్నీ పొడిముక్కలే అయి ఒక బొమ్మ లేకపోవడం బొమ్మలాంతరు. అప్పుడు ఆట కలిపి మళ్ళీ ముక్కలు కలపడం ధర్మం).

# ఆఖరిమాట మొదటిమాట!

ఆఖరిమాట మొదటిమాట
ఆశలకేం అనంతం
ఆకాశం నా గుడారం
అ ఆలు నా ఆస్తి
ఆసియా అంతవాణ్ణి
ఆశలకేం అనంతం
అప్పారావు నా నేస్తం
ఆంధ్రత్వం నా శాపం
విశాఖపట్టణం వూరు
వెర్రాసుపత్రి పేరు
ఆఖరిమాట మొదటిమాట
ఆశలకేం అనంతం
ఆసియా అంతవాణ్ణి
ఆశలకేం అనంతం

అమాంతంగానే కాదంటయ్యా క్రమంగా క్రక్రమంగా నా
సమస్తం మీ సమక్షంలో సమర్పిస్తా శమిస్తే
కపాలం నవ్వితేనేం కంపింపింబింబింపిస్తా[1] నీ
ప్రపంచాన్నే, పాటల్లో ఆటల్లో నా మాటల్లో

ఇదే నా రహస్యం
యథార్థం నా తురుపు[2]

నాకేమున్నాయిలే ఆసులా రాజులా రాణీలా
జాకీలా క్షణకాలం జెండా ఎగిరించేస్తాం
ఆ కొంచెం చాలదంటే సైనైడుకూడా కొంచెమే కా
దంటే కాదనండయ్యా అన్నయ్యలారా

శ్రీ శ్రీ

పరమాణువు నా ప్రపంచం[3]
నాతో నా గుణకారం

క్షణాన్నే సాగదీస్తే కాలం డొంకంతా కదల్దా
ఇలాగే ఎక్కుద్దాం శిఖరం కొత్తరాస్తాలు తీస్తూ
మిలిట్రీ లారీ నడిపించే పద్ధతిలో పద్హతితోనే
అణాలూ అరణ్యాలూ అణువులూ అబ్రములూ దాటుకుంటూ

ఆ వేగం నా వేగం
ఆసియాంకేం అనల్పం

వికృతత్వం సంకరసమాసంగా[4] కనబడితేనేం
ఒకానొక ఋజుత్వం సాధిస్తాం మనం లోపల
ఝకారీ వ్యాపారాల్లో పాల్గొంటామా చేస్తే
అకస్మాత్తుగా ఓపెన్‌గా చేస్తాం లేకపోతే నిద్రపోలాం

స్వప్నంలో స్వర్గం[5]
హతాశయాలకి పొటాసియాలు[6]

హిప్పోపొటామస హిట్లర్ హిండెన్‌బర్గ హిడింబ
హిరణ్యాక్ష రాజ్యాలూ ఇవన్నీ ఎందుకోయ్ హ్రీ హ్రీ
శ్రీతో శ్రీ[7] శ్రీశ్రీతో శ్రీశ్రీ శ్రీశ్రీశ్రీతో శ్రీశ్రీశ్రీ
శిఖరంపై జెండా శిలలకి ప్రాణం పిసితో పినాతో[8] స్నేహ

ఆఖరి మాట మొదటిమాట[9]
ఆశలకేం అనంతం[10]
అప్పారావు నా నేస్తం[11]
ఆంధ్రత్వం నా శాపం[12]
ఆశయం అంతర్వాణి[13]
ఆశలకేం అనంతం
ఆఖరిమాట మొదటిమాట
ఆశలకేం అనంతం

అప్పారావంత వాణ్ణి[4]
అపారేం అనంతం

Notes

Manifesto = Automatic writing + Psychomontage

1. Double verb telescopy
2. Aspects of Reality as laboratory data
3. Micromacrocosmology
4. Grammarian's funeral
5. Oneiric dominion status
6 "Suicide is no solution"
7. Binary fission
8. Heterosex...
9. Hyiteayn Proternn
10. Novelway, swansway
11. Camaraderie
12. Defeatism
13. Idealism
14. Megalomania

## DE - COMPOSITIONS

౧

తురాయికంటె, ఆ
కు రాయికంటె, కీ
చు రాయికంటె — హిమాం
శు రాయి గొప్పవాడు.

౨

భుజంగ ప్రయాతం. బుభుక్షాభిఘాతం
చలంగారి పాపం, ప్రజా మిత్రకోపం
జరుక్ చాథ **Zam - Buk,** మిణీశాస్త్రి **Humbu (K)**
లతాంతార్ద్రి రాగంబు లంబాడిలంగా...

౩

కాకికేమి తెలుసు **Psycho analysis ?**
ఆటవెలది ద్విపద కత్రగారు :
5, 3, 2, ఆముక్త మాల్యద :
విశ్వదాభిరామ వినురవేమ.
(పాఠాంతరం : దీని భావమేమి తిరుమలేశ)

౪

హాంగ్ కాంగ్‌లో
కింగ్‌కాంగ్‌తో
ఒరాంగ్-టాంగ్ ఆడిన
పింగ్ పాంగ్ లాగు ! ! !

(సశేషం. ఐహాలా)

# విదూషకుని ఆత్మహత్య

కొవ్వొత్తు లారిపోయినై
క్లోరోఫారంలా చీకటి కమ్మింది
ప్రపంచం తన మరణశాసనం రాసుకుంది.
విదూషకుడు ఆత్మహత్య చేసుకున్నాడు.

> యంత్రాల మంత్రగానం
> విషధూమాల తుపాను
> స్టీమర్లో చింపంజీ
> నాందిలో భరత వాక్యం
> మృత్యువులో సృష్టి
> విదూషకుని ఆత్మహత్య.

విదూషకుని వికట హాసంలో
కపాలం పకాలన్నది.
ఆకలి అన్నం వండుకుంది,
హంస ఆకాశం అందుకుంది.

> విదూషకుని విషాదం
> సముద్రంలో బడబాగ్ని
> భూకంపంలో ఫ్రూట్‌శలాడ్.
> కాని
> కొవ్వొత్తులు మళ్ళీ వెలిగి
> మరణ శాసనం మండి పోయింది.

# టాంటాం

నిన్ను
ఇంద్రుడవనీ, చంద్రుడవనీ
ఇంద్రుని సుతుడవనీ
చంద్రుని హితుడవని

    ఇంద్రసుతుని హితుని మేనమామ వనీ
    చంద్రహితుని సుతుని బావమరది వనీ
    కరి కరి భిత్
    గిరి గిరి భిత్-కబుర్లతో
    కవులు పొగడడం మేం వి
    న్నాం, వి
    న్నాం

కాని నువ్వు
పురుగువనీ నురుగువనీ ఏమీ
ఎరుగవనీ
వొట్టి చేటపెయ్యవనీ

    కొయ్యవనీ గుడ్డి గవ్వ
    చెయ్యవనీ

గోడమీద సిడవనీ
చేతకాని వాడవనీ
పెద్ద లక్క-బొమ్మవి వాజమ్మవనీ
మేధావద సాధారణ
గాథలు మేం నమ్మకనీ

    కష్టం కాపిచ్చుగాని
    స్పష్టం గానే మేం అం
    టాం! అం
    టాం.

# కొంటెకోణాలు

ఛందో బందోబస్తు లన్నీ
ఛట్ ! ఛట్ ఛట్‌మని త్రెంచి
**damn it** ! ఏమిట్రా ఇ ? దంటే
**Pray ! it's poetry** అందాం.

అర్థాన్ని అధ్వానపు అడవిలో వదలి
గద్యాన్ని పద్యానికి పెళ్ళిచేదాం.
కాదన్న మావన్న యెవడన్నా ఉంటే
వేమన్న యేమన్నాడో చూడ మందాం.

హోష్ షబాష్, హుబాష్ హోష్ అని కేకలు వేసి
కావ్ కావ్ మ్యావ్ మ్యావ్ అందాం గమ్మత్తుగా.
న...న...న...న...పత్తిమాటలు కూడా
మ...మ...మ...మ...మన వ్రాతల్లో ఉండొచ్చు
అచ్చా ! స్వేచ్ఛాజీవి !
ఐతే, కైతే నీ వ్రాతని
**argument** కోసం ఒప్పుకున్నా,
పానుగంటివారు ఒప్పుకోరు.

పానుగంటివారు ఒప్పుకోక పోతే
పాముపంటి దానికి విరుగుడుంది.
ఇంద్రకంటివారి నడిగితే
ఏమిటంటారో తెలుసునా
"పులికి పిలక లేదనడం
చలికి తెలుగు రాదనడం ;
శ్రీనివాసరావు వ్రాస్తున్నది
మానిషాద గీతంలో ఉన్నది."

కటకటా : లొటిపిటా చస్తే
కృ. శా. విషాదకావ్యం వ్రాయాలా ?
**Sex** లో **x** కర్థం తీస్తూ
చలం కలం పట్టుకోవాలా ?

జీబ్రాకి **algebra** చిహ్నాల
లాంకోటూ పాంకోళ్ళూ తొడిగి
సాహిత్య పౌరోహిత్యం ఇస్తే
వెర్రికాదు **surrealism** రా సోదరా.

# ఎ ఏ ఐ ఒ ఓ ఔ

## ఎ

ఎక్కడ ఎప్పుడు
ఎవరైనా చెప్పుడు ఈ చిక్కు విప్పుడు
ఆరంభం ఎక్కడ
అంతం ఎప్పుడు
ఎందుకీ నొప్పులు ఏమిటీ చప్పుడు

లక్షలు లక్షలు
యక్షప్రశ్నలు అన్నీ తప్పులు
ఏచోట జననం
ఏపూట మరణం
ఈలోపున ఎన్నెన్ని పడరాని తిప్పలు

కంట్లో కారం
ఒంట్లో ఖారం గుండెల్లో దాహం
ఉచ్ఛ్వాసం నిశ్వాసం
ఒకే అనుప్రాసం
సందేహం పన్నుతుంవి సరోరుహ వ్యూహం

ఆగమనం నిష్క్రమణం
అంతా ఒక చంక్రమణం ఆలోచించు బాగా
ఏదైతే సవాలు
అదేలే జవాబు
ఒమీగా ఆల్ఫా, ఆల్ఫా ఒమీగా

శాస్త్రం నీ అస్త్రం
మౌనం శ్మశానం అదికాదు జ్ఞానం
పరీక్షించు సహేతుకంగా
ప్రసంగించు సాధికారంగా
ఎమ్సిస్క్వే సూత్రం మాత్రం సరైన విధానం

ఏమిటీ చప్పుడో
ఎందుకీ నొప్పులో అంతం ఎక్కడో
ఆనందం ఎప్పుడో
ఆ చిక్కు విప్పడు
ఎక్కడా ఎప్పుడూ ఎవ్వడూ చెప్పడు

ఏ

ఏదైనా గీతం
చేదైనా మైమరపిం
చేదైనా మది కదిలిం
చేదైనా ఎద రగిలిం
చేదైనా ఏదైనా
నేడైనా
రేపైనా

ఏమైనా గానం
జడి జడిగా వర్షం నా
మెడమీదా
తొడమీదా
తడితడిగా రక్తం నా
గదిలోనూ
హృదిలోనూ
దడదడగా కంపం నా
సడినెత్తిని రంపం

నా కోసం ఆకాశం
చేకూర్చే ఆవేశం
రేగించే ఉద్రేకం
ఊగించే ఉద్వేగం

దావానల హాలాహల
కీలోజ్జ్వల కోటీరం
నీలోత్పల కాసారం
నీలోపల కేయూరం

కనిపించక జడిపించే
కికురించే సకిలించే
కిటికీలో రూపం వా
కిటి ముంగిటి ధూపం

గాలంవలె శూలంవలె
వేలాడే కాలం
వేటాడే వ్యాఘ్రం అది
వెంటాడును శీఘ్రం

కాలానికి భయపడితే
కలిగేదే శోకం
కదిలేనా లోకం
దొరికేదా నాకం

కనుపాపలు తెరచాపలు
ప్రళయంలో పయనం
నిలయంలో శయనం
విలయంలో విజయం

ఐ

ఐక్యం అదీ మనకి ముఖ్యం
అందులోనే ఉంది సౌఖ్యం
లేనిపోని చీలికలు
రెండు రెండు నాలికలు
ఛీ యిదా బతుక్కి
ఫాయిదా

శ్రీ శ్రీ

ఐక్యం అదీ వ్యవస్థ
అప్పుడుండదు మనకీ అవస్థ
కాదు ఔను అవును
కాదు కాదు అవదు
అనేకం అయితే ఏకం
అదే వివేకం

ఐక్యం అన్నింటికీ మూలం
అదే కదుల్తోంది కాలం
పురోగతి ప్రపంచనీతి
మనదౌకే మానవజాతి
వ్యక్తికి బహువచనం
శక్తి

ఐక్యం అదే మనకి గమ్యం
అప్పుడే సిద్ధిస్తుంది సామ్యం
స్వార్థం స్పర్థంటా
యుద్ధం వద్దంటా
కామ్యం ఐక్యం అయిన ఒతుకే
రమ్యం

ఐక్యం ఎప్పుడో కాదిప్పుడే
ఎక్కడో కాదు ఆదిక్కడే
మాట చేతగామారి
మనిషి మనిషితో చేరి
స్వప్నం సత్యం ఐతేనే
స్వర్గం

ఓ

ఒకనొక అనగా అనగాల వేళ
(అది కృతయుగం

కాదు మృతయుగం)
అదే మన కథలకి కవిత్వాలకి డోల
మనుష్యుని బాల్యంలోని అమాయకత్వం
(ప్రార్థించే మొక్కలూ
మాట్లాడే నక్కలూ)
కళలో జీవితంలో నిదర్శించే అరణ్య తత్వం
సామూహికం స్వాతంత్ర్యం అన్వేషించు అగత్యం
(ఒంటరితనం
తుంటరితనం)
సామాజికంగా పెరుగుతోంది స్వేచ్ఛ ఇది సత్యం
అజ్ఞానం చీకటి భయానికి క్రౌర్యానికి కాణాచి
(శిశుత్వం అదే
పశుత్వం అదే)
చంపడానికి సరదా అమ్మయ్యో బూచి
మార్చాలంటూ ఇదంతా ప్రసరించాలి కాంతి
(శాస్త్రం కళని చంపబోదు
జనాన్ని భయంతో నింపలేదు)
మానవాళికి పరిణామం కానుక పావురంలాంటి శాంతి

ఓ

ఓహో విహంగమా
ఎగురు
ఎగురు
నీ రెక్కల విసరులో మన్వంతరాలు
తరలు
తరలు
ఓహో తరంగమా
కదలు
కదలు

నీ ముంచెత్తు వరదలో నిమ్నోన్నతాలు
కరగు
కరగు

ఓహో మృదంగమా
పలుకు
పలుకు

నీవిచ్చు హెచ్చరికలో నిరాశా దురాశా భాండాలు
పగులు
పగులు

ఓహో జనాంగమా
నడువు
నడువు

నీ పరాంకోటి హస్తాంతో నూతన గవాక్షాలు
తెరువు
తెరువు

## ఔ

ఔను వాహనం మారింది ; దూరానికి పూర్వపు టర్థం పోయింది
పూర్వ దూరం పోయింది వెనకటి వాహనం మారింది

ఆ సూర్యుడే నేడూ
ఆ చంద్రుడీ నాడూ
అవే నక్షత్రాలూ — ఐనా కాలం మారింది
ఔనా కాలం మారింది మరి ; మానవుడా మేలుకో నేస్తం
ఎద్దుబండితో కొలవకు దూరాన్ని ఎగరవోయ్ చదలయెద దీలుస్తూ
రేపు బయల్దేరా లనుకున్నావు
నేడే ఇచ్చటికి వచ్చేశావు

విచ్చేసింది ని తరుణం పుచ్చుకో ఇది నీ ఖావి
ఇది నీ ఖావి గ్రహించు : ఈ భావి నీకు నా ప్రెజెంటు
భూతకాలపు సరీసృపాలని పాతరాతి యుగంలో పారేయ్
పాతెయ్ నీ సందేహాలని
తోలెయ్ నీ మందాక్షాలని

నిటారుగా నిలబడు నేస్తం హుటాహుటిగా ముందుకిసాగు
హుషారుగా ముందుకిసాగు : ఊరిఖే వెనక్కి చూస్తావేం
దుప్పివీ కుక్కవీ కావు తిర్యగ్దృక్కువి నువ్వుకావు
దూరం కరిగిపోతోంది
కాలం మరిగిపోతోంది.
మానవుడిగా మేలుకో నేస్తం ఏలుకో ఈ విశ్వం సమస్తం

# అభిసారికి కడసారి

ఆకాశంమీద రాకాసికోర
ఏడకయ్యా పోతావు
కోరచుట్టూ నెత్తుటి చుక్కలు
ఏడకయ్యా పోతావు

కనుమలోనిది-కొ-కొ-కొ-కొలిమి
వెళ్ళకయ్యా చెడతావు
నీడచూడకు నీకే హాని
సంకేతం నీ శ్మశానం

వింతైనది విహంగం
ఏడకయ్యా పోతావు
చూపులలోనివి సూదులు
ఎందుకయ్యా పోతావు

'పడుచుదనానికి జడుపులేదు
సంకేతం నా సరస్సు'
వెళ్ళకు వెళ్ళకు చస్తావు
నాచు నిండిన కోనేరు

ఏమిటీ దంతపుచర్మంమీద
ఎర్రని పచ్చని దేదోమచ్చ
లోతులోయలో భూతాలు
కొలిమి నిప్పులో గుర్రాలు

సూదికి కంట్లో సోపానం
కాళ్ళకి కళ్ళూ సంకెళ్ళూ
సంకేతం నీ సాల్వెర్సాన్
జలపాతంలో జంఝూవీ

# ఒకటీ-పదీ

ఈ ఫస్టోబరు రోజు ఎవరా వస్త
చెప్పండి కాస్త ఎవరా వస్తున్న రాజు
ఆరంభ మంగళముహూర్తం ఆసన్నమయింది
ఆహ్వానం కోసం మా గానం ఆయత్తమయింది
అయితే ఆ వస్తున్నది ఆం అవునో కాదో
ఆస్వాదించబోయే అనుభవం ఆఖరుకు తీపో చేదో
శ్రీరాములుచుట్టి చిత్తగించవలెను దాకా
ప్రవహించిన విజయ ప్రభవించే తనయ
ఆం కాకపోతే ఏం అందులో ఒక ముక్క
ఆ ముక్కలో ఒక చెక్క అయినా ఇదే మా ఓం
అదో పదో నెల బాల
హాస విశాల
పుట్టింటి కొస్తోంది
పూర్ణ గర్భిణి

౨

తారంగం తారంగం లాలీ లాలీ
ఆనందం ఆనందం హాయీ హాయీ
శంఖాలూ ఢంకాలూ మ్రోగించండీ
స్నేహార్ద్రం సౌహార్దం సాధించండీ

రైలుబండి లేటయిందా
వంతెన చుట్టూ వరదలా
ఇంజన్ సరిగ్గాలేదూ
ఎందు కథంతా పోదూ

పూలదండతో
నిండింది స్టేషన్
కోటి గొంతుకలతో
పాడింది నేషన్
పదిలంగా పొగబండి
చేరింది డెస్టినేషన్
రారండీ రారండీ యౌవనమ్మందీ
ఆడండీ పాడండీ హ్లాదం చెందీ

ఆంధ్రరాష్ట్రం ఆగమనం
అసత్యం కాజాలని చారిత్రక వాగ్దానం
మన చరిత్రాత్మక నిరంతరాందోళన
చరితార్థ మయిం దీనాడు

ఈ రాష్ట్రం ఇదిగో ఇప్పుడే చెబుతున్నా
ఏదో కొందరి సదుపాయాని కేర్పడలేదు.
ఎవరో కొంద రుద్యోగులకని వేర్పడలేదు

ముక్కోటి ఆంధ్రుల అకుంఠిత దీక్ష
అజేయ సంకల్పం
ఆంధ్రావతరణకి కారణం

ఈ రోజు ఊరేగింపులు జరుగుతాయ్ నిజమే
ఉత్సవాలు జరుగుతాయ్ నిజమే
ఉత్సాహం ఉప్పొంగుతుంది నిజమే
యథావిధిగా అన్ని లాంఛనాలూ సాగుతాయ్ నిజమే

కాని ఆ లాంఛనాలన్నింటి తర్వాత
వచ్చిన అతిథులు వెళ్ళిపోయిన తర్వాత
పాటలూ ప్రసంగాలూ జయ జయధ్వానాలూ చల్లబడ్డ తర్వాత

సంబరాల తర్వాత
సంపాదకీయాల తర్వాత
సామాన్య మానవుడి భుజస్కంధాల మీద
సమస్తభారం పడుతుంది
అతనిదీ ఈ రాష్ట్రం
అతనికోసం ఈ రాష్ట్రం
పెత్తనం చెయ్యాలని ముందుకొచ్చే
పెద్దలిది గ్రహించాలని హెచ్చరిక

శుభంగా శోభావహంగా
ఆకారం తాల్చుతున్న ఆంధ్రరాష్ట్రం
ఆంధ్రజాతి కంతటికీ విజయం
ఆంధ్ర సంస్కృతికి అఖండ విజయం
ముఖ్యంగా అతి ముఖ్యంగా
ఆంధ్రభాషకిది అపూర్వ విజయం

ఇది వినండి మరి
విప్లవం ముమ్మందు మనుష్యుని మనస్సులో ప్రారంభమవుతుంది
మనఃప్రపంచానికి బాహ్య స్వరూపం భాష
భాషావిప్లవమే భావ విప్లవం
అందుకే ఈ ఆనంద సమయంలో
భాషలోనూ భావంలోనూ విప్లవం తెచ్చిన
మహా మానవులైన
మన గిడుగు గురజాడ వీరేశలింగం
మహనీయులను
నా మనఃఫలకం ముందు సాక్షాత్కరింపజేసుకొని
నమస్కరిస్తున్నాను
వారిచ్చిన ఆశీర్వాదాలు
తీర్చిదిద్దిన ఒరవడులు
చిరకాలం మన ఆంధ్రావనికి
శ్రీరామరక్ష

దేవతలే మానవులేకే దీవించాలి
దేశంలో దేవత్వం దీపించాలి

ఈ ఫస్టోబరు శుభవేళ
నిన్నటి మన స్వరూపం స్మరించి
నేటి మన స్వభావం గ్రహించి
రేపటి మన సమాజంకోసం కలిసిమెలిసి క్రమించుదాం

నిన్న మన ఓడరేవులనుంచి దేశదేశాలకి
మన నాగరికత నౌకాయానాలు చేసింది
నేడు మన రహదార్లు ఎద్దుబళ్ళకి ఏడుపు తెప్పిస్తున్నాయ్
ఇనుపదార్లు ఇరుకైపోయినాయి
రేపు మన విశాలాంధ్ర విమానాశ్రయాలనుంచి
మహాకాశాల్లో మన విమానాలు ప్రయాణం చేస్తాయ్.

నిన్నటి మన రాజనగరాల్లో
రత్నరాసుల విపణివీధులు
విదేశీయులకి విభ్రాంతి కలిగించాయ్
నేడు పట్టణాల పాలకసంఘాలు
దరిద్రాలను తరిమి వెయ్యలేక
అంధకారాన్ని అరికట్టలేక
అటమటించి అల్లాడుతున్నాయ్.

రేపటి మన జల విద్యుత్ ప్రణాళికలు
సిమెంట్ కాంక్రీట్ వినిర్మాణాలు
ట్రాక్టర్లు బుల్‌డోజర్లు
పారిశ్రామిక వ్యవసాయక సహసమానాభివృద్ధితో
ప్రతి కుటుంబానికీ ఒక నివాసగృహం చూపిస్తాయ్
ప్రతివ్యక్తిచేతికీ ఒకపని కల్పిస్తాయ్
ప్రతి మనస్సులో ఒక పరిశుభ్రమైన గీతం పలికిస్తాయ్.

నిన్న మనదేశం మహామంత్రులైన అక్కన మాదన్నలని
లోకానికిచ్చింది

నేడు మంత్రి పదవుల మంతనాలతో వాతావరణంలో
దుమ్ముదుమారం చెలరేగింది
రేపు జాతిసంతతినీ ఏకమార్గంలో నడిపించి
అఖిలభారతావనికే ఆదర్శం చూపించగల
మహానాయకుడు మనకు లభిస్తాడు

నిన్న తమకంటె హెచ్చువారి కాళ్ళుపట్టుకొని కొలిచి
తమకన్న తక్కువవారిని కాళ్ళకిందపట్టి అణచి
చిరునవ్వుతో స్తిమితంగా సర్దుకుపోయే మనస్తత్వం
నేడు ఆ మనస్తత్వపు అవశేషాల నెదిరించి
పోరాడుతున్నవారి తిరుగుబాటు
రేగించిన ప్రచండ సంఘర్షణల
ప్రభంజన గర్జన

రేపు మానవుడు మానవునిలోని మాన
వత్వం గుర్తించి మహనీయములై
సరికొత్త మర్యాదలు సృష్టించే
మహత్తరకాలం

నిన్న కవిత్వానికి రాజాధిరాజుల ఆదరణ
నేడు ప్రభువులలో పరిపాలకులలో ఇంకిపోతూన్న రసహృదయం
ఆనందానికి అవకాశాలూ తీరుబాటూలేని
అసంఖ్యాక ప్రజానీకం
రేపు మేలుకొన్న ప్రజలు శిరస్సున ధరించి
ఆదరించే అతి నవీన కవితామాధుర్యం
సంతోషం సంరంభం నేడే నేడే
సౌమార్గ్యం సౌభాగ్యం రేపే రేపే

# నగరంలో వృషభం

నగరం నడి వీధిలో
వృషభం తీరుబాటుగా
గత జన్మ సంస్కృతులు కాబోలు
కనులర మోడ్చి నెమరేస్తూ
కదలకుండా మెదలకుండా
నగరం హృదయంలో వృషభం
దారికి హక్కుదారు తానే అయినట్టు
పరిత్యజించి కాలానికి బాధ్యత
పరిహసించి నాగరికత పరుగు
నిలబడింది నేనే రాజునని

ఎవరు పొమ్మనగల రీ ఎద్దుని
ఎలా చూస్తుందో చూడు
ఏయ్ ఏయ్ మోటారుకారూ
ఏఃవి టీఃవిటి నీ తొందర
ఖాయ్ ఖాయ్ సైక్లిస్ట్
భద్రంసుమీ ఎద్దు నిన్ను తప్పుకోదు
యంత్రవిరోధి అహింసావాది శాకాహారి
మద్యనిషేధ ప్రజ్ఞాశాలి
నగరం నడివీధిలో
నాగరికత గమనాన్ని నిరోధిస్తూ
ఇలా యెంతసేపయినా సరే
ఈ యెద్దు నిలబడగలదు

ఎద్దుకి లేకపోతే బుద్ధి
మనిషికేనా ఉండొద్దా?

# అధివాస్తవికుల ప్రవేశం

కాసరమా వికారములు కార్చకు పూసరమా మసారపున్
రాసులలో కపాలములు రాల్చకు తావళమా విషాదపున్
వేసములో కుశాసనము పేర్చకు రాసభమా సమాధిలో
మీసము పెంచి మా తొడల మీద నటించకు పుణ్యమయ్యెడున్

నిచ్చెన పచ్చి నెత్తురులు నింపి నిలింపుల దుంపత్రెంపి కా
ర్చిచ్చులు త్రచ్చుకొన్నది శచీపతి పీచమిణాయి వేటలో
పచ్చిక మచ్చికైనది క్షపాకర భీకర సూకరాకృతుల్
పిచ్చిదనాలుపోయిరి కబీరుపు త్రాగిన రోషనారలై

ప్రాతది సూదికన్ను పొరపాటున తా తెరచాటు చేసి ఘో
షా తిలకించబోయి వెదజల్లును గమ్మడి పూదుమారముల్
లేతది రావికొమ్మ పడలేదు భయానక దందశూక ని
ర్ఘాత పతాక దానికొరకై యిరుకైనవి సందులెందుకో

గంధముగా మెడన్ పులుమగా తలపోయుదు వంభకారపున్
బంధకి యూర్చు జాలి పసుగాలను గాలము వేసి లాగుచున్
సింధువు పిల్చెనా పరిహసించెను సైగల? సుప్తశోణ పా
ణింధమ ఖడ్గధార హవణించకుమీ తిలకాష్ఠ వహ్నిలోన్

మ్రింగి తిమింగిలాంగల తమిస్రగుహాంతర మీనమేష పా
రంగతులైన బొంగరములార యెరింగిన తెల్పుడా పరి
ష్వంగము పాడుటెందుకు? విపంచికి కంచికి దూరమెంత? వ
ద్రంగుల రంగులా గులకరాళ్ళగు మా గుడిలోని లింగముల్?

ఉద్యమ నాయకా చదువుకో: వినిపించని కంచుకాగడా
వాద్యములన్ నిశానిశిత వల్లరి అల్లరి యల్లికన్ సము
త్పాద్య సుధాప్రభావ్యతలు భావుకులొంగని భావశాఖలో
చోద్యము ఊహలో మలుపు చూడ్కులు నీతలమున్క కొన్కలై

కైకొని కాకికన్ను కలకాలపు చూపులు రెక్క రిక్కపై
పైకొని మేకతాకిడికి ప్రాణము హాయి బజారు జారుడై
డాకయికై కీడాని పగడాల గుడారములో విడాకులై
రోకలి కోదనాకులత కోదసినిండిన రోగభోగమై

మౌనము శంఖమై చెరగుమాయగ నేత్రపతంగ బింబ ని
ధ్యానము కొంగనెత్తురులు త్రాగెడు నల్లతురాయి పూవుగా
వేనలిపై అవే అయిదువేల కుశీర కురార దారుణ
ప్రాణ శిలీంధ్రముల్ తిరుగుబాటు తుపాకి తుపాను కానుపుల్

వచ్చెడువాడు ఫల్గుణుడు వార్ధితరంగ మృదంగ ఘోషలో
విచ్చెడు మచ్చుమందు పలవించెడు కించి దుషస్తుషారముల్
పచ్చిక మచ్చికైనది ప్రపంచపు నెత్తురు వంటపాటలన్
మెచ్చనివాడ నీ మెడలమీద సివే ఉదయాద్రి రౌద్రముల్

# మహాకవి ఆశ్చర్యం

సూది కొసవలె సూక్ష్మమైన ఒక లోకం. నా ఆలోచన అయస్కాంతం.

అణువులో ఆలాపన, కలంలో కలకలం. అణాలో ఆల్కెమీ. ఆరాధనలో ఆముదం. జింహాన్ నన్ను తింటానంది. రత్నాలు 9. రసాలు 9. ఆకాశనేత్రంలో అష్టాదశ పురాణాలు. ఇంద్రధనుస్సు వాయిస్తూ ఎవరో పాడుతున్నారు ప్రవాళ ద్వీపంలో మరకతమంజీరం కాబోలును ?

## ఆంబోతులు

మరచిపోయి చూచినవి, చూచి మరచిపోయినవి, అనుకొని ఆలకించినవి. ఆలకించినట్టు అనుకున్నవి, ఆకస్మికంగా ఆఘ్రాణించినవి, రుచిచూచి రచించినవి, స్పృశించి అనుభవించినవి, రమ్మంటే రావు, వొద్దన్నావొస్తాయి. నాటకశాలలో గురకపెడుతూ, జంతు ప్రదర్శనశాలలో పియానో వాయిస్తూ, వస్తు విక్రయ శాలలో వేణ్ణీళ్ళు తాగుతూ బ్రిడ్జిప్రక్క పిల్లిమొగ్గలు వేస్తూ, లాడ్జిలో కూరగాయలు కోస్తూ ఎప్పుడో వస్తాయి, ఎలాగో చూస్తాయి.

## కెమీరాకన్ను

చంద్రకిరణాలనే శాశ్వతంగా తాగలేము. సందులో వుంది సాహసం. జడవ నివ్వదు సౌందర్యం. సరదాకొసని కొరడా కొసని సరదాకొసని కొరడా. నా యిష్టం వచ్చినంత రాస్తాను. ఎక్కడ ఆగాలో ఎరుగుదును. అధరం నా ఆదర్శం బింబంలో ప్రతిబింబం.

హం

మో దం

సం

కూర్చొని చేసిన పాపం గుడికట్టినా పోదు. చిన్నప్పటిమాట. ఆడపిల్ల బడిలో అపెండెక్సు రిజిస్టరు తస్కరించిన తర్వాత చేతిలోపని చేతిలోనే అయి పోయింది. "అన్నన్నా, ఎంతపని చేశానా" అనుకున్నాను. కొన్ని సంపాదకీయ రచనలకంటె నయమే అనిపిస్తుం దిప్పుడు.

## క్రైమా – చే సిరి

పిల్లి తాగుతూన్న పాలలాగు బాధతో పడుక్కున్నాను. కొన్ని రూళ్ళ కర్రలు, వాటికొక దారంకట్టి లాగుతూ పందికొక్కులాంటి పొడుంగొక్కు వస్తోంది. సీసాలు తే. పసుపుపచ్చని పత్రికలు కట్టుకొని పెళ్ళికూతురయింది వాస్తవికత.

## శారదాబిల్లి

ఛందస్సు (గాయత్రీ సాక్షిగా చెబుతున్నాను) ఎటు తిరిగితే అటే ఒరుగుతుంది. విధానంలో వికారం - మాత్రలు మింగడం నాకు చేతకాదు. అల్లిక దంగ వల్లిక, అంకెలు మన సంకెళ్ళు. అడగవయ్యా ఆర్థికశాస్త్ర పండితుణ్ణి. పర్వతం పండి బద్దలవుతోంది, లావా—

## దేవి

శ్రావణ శుద్ధ దశమీ సోమవారం మెడమీద అవతారాలు కప్పుకొని చంద్రుడు తొంగిచూశాడు. బడబానలంవలె భయంకర మనోహరమైన పయోధి. అదృష్టంవలె, అఘంవలె, నౌకాభంగంవలె, నగ్ననక్షత్రంవల్లె, నలుచదరపు నీలిమందు అండలోనిది తిమింగలం. దానికొక ఔత్ఖానా, దంతాలసందున కార్ఖానా.

## ఔరత్ ఖానా

జరత్కారుని చమత్కారంలాగు నన్ను నేను తిరగేసి తొడుక్కున్నాను.
అడుగునుంచి చూస్తే అస్థిపర్వతం;
అగ్నిపంజరం, మీదనుంచి చూస్తే మేగ్నాకేసు; మీరట్ కార్టా.
అర్థంకాదు ఆలాపన - అయితే - అబద్ధంకాదు ఆశ్చర్యం.

## మహారాజశ్రీ

కళ్ళ పిడికిళ్ళలో కర్పూర నీహారం ధరించి, ఉపమానంవంటి ఉల్కాగ్రైవేయంతో కనీనికాధిష్ఠిత కాళిదాసుడై, ప్రబంధగ్రంథ గంధగజాన్ని అధిరోహించి అకస్మాత్తుగా సాక్షాత్కరించాడు మహాకవి ఆశ్చర్యం.

## అతివా ( ! ! ! ! )

రానేవచ్చావు ఎలాగూ, కళ్ళతోనయినా ఒకమాట అడుదూ— లాల్చి విప్పేస్తానన్నాను. బహిరంగ రహస్యాలు బయటపెట్టడానికేమున్నాయి? అందరూ

అనుకుంటున్నవే. తలలలో దాచుకుంటారు. కలలలో కరవ్వొస్తాయి. అన్నీ నాకు 64 లాగే కనబడతాయ్. పరధ్యానంగా ఉన్నప్పుడు అర్థమవుతాయి.

## ఆల్కెమీరా

అన్నిటిలో అందం వుంది. అర్థంవుంది. కావలసినన్ని ఉపమానాలకి అక్కరలేనన్ని ఉపమేయాలు, ఎక్కడో పోలిక దొరుకుతుంది. ఎక్కడో చేతులు కలుస్తాయి. స్నేహం చేపడుతుంది. ఇంద్రనీల మణులను కరిగించి ఎవరో సముద్రాన్ని సృష్టించారన్నావేవే. ఆ మాట రుజువు చెయ్యగలవా? కార్మిక ఘర్మ కఠోర క్షారతలో కడలికి రూపం కలిగించని నేనంటేనా కోపం? అదో దృక్పథం. అదో చిత్తవృత్తి, ఆ స్థితిలో అన్నీ క్షమిస్తావు. అన్నీ రుచిస్తాయి.

## దృక్కోణం

స్వప్నాలను కోస్తున్నాడు శస్త్రవైద్యుడు... లలో, మేఘాలలో ...యలలో, లోయలలో ఉన్నవి ఉంటాయి. పోయినవి పోతాయి. నీకెందుకు బాధ? బా...ధ బా...అబ్బా...బా... బా, బా, బా, బాం, బాం, బాం, బాంబు.

# మాటలమూట

ఒక మంచి శుక్రవారంనాడు (అయ్యో అంతమంచిది) నా భాషను మూట కట్టి, మూపున వేసుకొని, నా విశ్వాసంగల కుక్కను వెంటబెట్టుకొని బయలుదేరగా. సూర్యుడు చూస్తున్నాడు. పువ్వులు నవ్వుతున్నాయి.

నేను చేస్తున్న ప్రయాణపు దారిలో ఆగమని ఒక చెయ్యి అరిచింది, ఎవరిదా చెయ్యి అని ప్రశ్నించగా, (నేను కాదు. కుక్క) మాయమయింది. నేను ఆగలేదు, అక్కడే ఉన్న చెట్టు అంతసేపూ నేను చూడనిది నాకంటి నాకర్షించింది. దేవేంద్రుడేమో అని భయపడ్డాను. వెయ్యి కళ్ళున్న ఆ చెట్టును చూచి, వాటిలో అన్నిటికన్నా ఒక పెద్ద కన్ను ఆగమని అరిచింది. నా పదాల చప్పుడు భూమి లోని తన వేళ్ళద్వారా పసికట్టిందేమో, నేను ఆగలేదు.

నామూపున భారంగా తోచినభాష దాహం వేస్తున్నదని అరిచింది. అసలే ఆకలిగా ఉన్న నేను సరసులదారి తప్పిపోయాను. మంట ముళ్ళడొంకలు, నెక్టై, టైపురైటరు, హంస ఎందువల్లనో వరుసగా ఒకదాని తర్వాత ఒకటిగా నా మనస్సులో దొర్లుతూ క్షణంలో కనబడి మరుక్షణం మాయమైపోయినవి. నాకు వాటి అర్థంగాని అవసరంగాని అవగాహన కాలేదు.

నా కుక్క ఇంతలో జాలిగా అరిచింది. ఎవరా వస్తున్నవారు? ఎదురుగుండా గుండెలు బాదుకుంటూ, మూడు చీలికలుగా చీలిన నాలుకను జడిపింపుగా కదిలించుతూ, ఎవరా వస్తున్నారని చూశాను. మరు మరీచిక. మరీ చికాకుపడి, నన్ను నా అవజ్ఞతకు నిందించుకొని, నిలవకుండా నడిచిపోయాను.

నన్ను ఆగమని ఆజ్ఞాపించవద్దని అవ్వని ప్రార్థించాను. అవ్వకి బ్రహ్మ చెవుడు. ఆవిడచుట్టూ ఆవిడవంటివారే మూగి, ఆధ్యాత్మిక భజన చేస్తున్నారు. కొన్ని ప్రశ్నార్థకపు గుర్తులూ, ఒక విభూతి పండూ, రెండు మూడు అక్షింతలూ నామీద వేశారు. నాలో ధిక్కారం ఫీంకారం చేసింది. ప్రశ్నార్థకపు గుర్తులను మాత్రం మూటలో కట్టుకొని, వెళ్ళిపోయాను విసురుగా.

మూటలో విప్లవం, మాటలు కలుస్తూ, విడిపోతూ, నాట్యం చేస్తూ, ప్రాకుతూ మొగ్గలు వేస్తూ, పాడుతూ, అరుస్తూ విప్లవం.

కొమ్ముల బండికాకాసి నాకేసి చూసినప్పుడే వివర్జిత ఘటస్థించింది. గుణితం ద్విగుణితమయింది. ఓ అధ్వానపు అడవీ, అసారకాసారమా (,) ఆగమన్న వాడిని

నేను నన్ను ఆగమన్నప్పుడు నేనెలాగ ఆగలేదో ఆలోచించుకొని అన్నానా, లేదులే.

కొన్నిమాటలు లయగా కలయగా వాటి ధ్వనులవల్ల ఒక శక్తి రేగింది. కవిత్వం పట్టుకో అన్నారు. చిన్న పిల్లల గొంతుకలోనికి పారిపోయి దాగుంది. వార్తాశీర్షికలూ, సినిమా ప్రకటనలూ నన్ను ఆకర్షించడం మానలేదు. కార్టూన్ చిత్రం కలతపెట్టి, కలలు పుట్టిస్తుంది. హల్లుల అడావుడికి అచ్చులు విచ్చుకత్తులు, అచ్చులమాట వచ్చినప్పుడు ఆర్థర్ రాంబో జ్ఞాపకం వస్తాడు. మనలో వర్ణభేధం పోయిందికాదు. సంక్రాంతికి రంగులేదు. నిఘంటువుకి నిప్పుపెట్టె.

తర్వాత కొంతకాలానికి ఒక గడుసు పని చేశాను. అది నా రహస్యం. ఒక్క నా కుక్కకు మాత్రమే ఎలా తెలిసిపోయిందో తెలిసిపోయింది. నేను చాలా భయపడ్డాను. ముఖం చేతులలో మూసుకున్నప్పుడు చేతులలో వంఖం కనబడింది. నా కన్ను పేరు కామాక్షి.

ఇంతలో విశ్వనాథ సత్యనారాయణ వేషం వేసుకొని, నన్నయభట్టుగారు కనబడ్డారు. నమస్కరించాను. నమ్మలేదు. ఆ మూట విప్పమన్నారు. మీ వేషం విప్పండన్నాను. వీలులేదట. ఈ రీతి మేము హోరాహోరీగా పోరాడుతుండగా, రుక్మిణీనాథశాస్త్రి వేషం వేసుకొని రుక్మిణీనాథశాస్త్రి వచ్చాడు. ఆ మూటలో ఏముందో నాకు తెలుసునన్నాడు. రెండే రెండు అక్షరాలు. శ్రీశ్రీ అన్నాడు. నాకాశ్చర్యమయింది. నన్నే నేను మోస్తున్నానంటే నమ్మలేక పోయాను.

(టీక : మన భాషలో అతివాస్తవిక రచనకు ఇదే మొట్టమొదట ప్రయత్నం. అతివాస్తవిక రచన అంటే మనస్సంచారంలోని అసంలక్ష్యక్రమాన్ని పైకితేవడం అన్నమాట. రూపం సరిగా ఏర్పడని ఊహలకు రూపం ఇవ్వడం. "మంట, ముళ్ళ డొంకలు, నెక్టై, బైపు రైటరు, హంస ఇవి ఎందువల్లనో వరుసగా ఒకదాని తరువాత ఒకటిగా నామనస్సులో దొర్లుతూ క్షణంలో కనబడి, మరుక్షణం మాయమైనవి" అన్న వాక్యంతో పైన అన్న వాక్యం సమన్వయిస్తుంది. అసార కాసారమా (,) 'కాసారమా' లో సారపోతే, కామా (,) 'ఇది' మనకు కొత్తదికాదు. వసు చరిత్రలో, సారసలోచనలున్నచోట రసభంగం అంటే సాలోచనలౌతారు అన్నదానిలాంటిది ఇది. ఐతే, నాకన్ను కామాక్షి, కామా చూపులు చూసింది అన్నతో, కొత్తే. పువ్వులు చూస్తున్నాడు. చెట్టు అరవడం ఇవన్నీ అతీతమైన ఊహాకు నిదర్శనాలు.—సంపాదకుడు)

# ఎన్నాళ్లు ఇంకా

గండభేరుండపు లెక్కలతో ద్వేషం వచ్చింది. పేదవాళ్ళతో చెప్పింది. "మిమ్మల్ని దోచుకున్నా" రని.

మురికి కాలువలను చూపిస్తే నగరం మొగం చిన్నబోయింది. ఫ్యాక్టరీ గొట్టంలో ప్రతిధ్వనించిన కేక విని కార్మికుడు తుళ్ళిపడ్డాడు. అతని కళ్ళలో ఆహాశ్చర్యం.

ఎన్నాళ్ళు అంది ఎలక్ట్రిక్ ట్రెయిన్, ఎన్నాళ్ళు అంది ట్రాంబండి, బస్సు, జట్కా, రిక్షా, ఎన్నాళ్ళు అంది షాపునోరు. ఎన్నాళ్ళు ఎన్నాళ్ళు అంది కాలేజీ అంది ఆసుపత్రి అంది మ్యూజియం.

నడి వీధిలో వాన

ఎక్కడయినా దొరుకుతుందా ఒక్క పుష్పం అని వెదికాను. ఏ కాఫీక్లబ్బు కూడా నన్ను ఆహ్వానించలేదు. ఈ చీమలకు రెక్కలువస్తే ఏందారి అనుకున్నాను.

ఎన్నాళ్ళు అంది ద్వేషం.

కళపెళ కాగుతోంది రక్తం. బిగుసుకుపోతున్నాయి సంకెళ్లు. పిడికిలిపట్టి ఆకాశాన్ని బెదిరించాను. వికటంగా నవ్వింది మెరుపు. ఉరుము నన్ను ఓదార్చింది.

ఎన్నాళ్లు అంది వాన.

# ప్సామవేదం

## గురజాడ అప్పారావు

పాడకోయ్ కవీ! కాంగ్రెస్ ఒక
భజనసమాజం మాత్రమే అనీ!
ప్రతినిధులంతా నిద్రపోయినా
భవనం క్రిక్కిరిసిన సత్రమే సుమీ!

కాంగ్రెస్ నిత్యం, కాంగ్రెస్ సత్యం
స్వపరిపాలనం కాంగ్రెస్ గమ్యం!
ఆత్మ అనే దీపం వెలిగేందుకు
ఆదర్శమనే తైలం ముఖ్యం!

కాంగ్రెస్ యుద్ధం - రూల్సుప్రకారం
కాగితాలతో! నామకార్థం!
అడపాదడపా అంతఃకలహం!
అయితే బిల్‌కుల్ అహింసాత్మకం!

మితవాదులు నేర్పే గుణపాఠం
ఏయే యెండల కా యా గొడుగులు!
కాదన బరిదిగి తిరగబడేవో
ద్వీపాంతరమే! లేదిక తిరుగుడు!
కావున జోరుగ కంఠశోషగా

ఉపన్యసిస్తూ నుంచుందాం!
అస్తమానమూ లాభం చూడక
రాజభక్తితో పొంచుందాం!

[1908 మద్రాసు కాంగ్రెస్ మీద గురజాడ అప్పారావుగారు ఇంగ్లీషులో వ్రాసిన పేరడీకి అనువాదం.]

# ద్వేషగీతం

పాల్ ఎలార్డ్

(PAUL ELUARD)

ఔనుమరి బూర్జువా వర్గాలన్నా
పోలీసు రాజ్యం
పూజారి రాజ్యం అన్నా
నాకు విపరీతమైన ద్వేషం
అయితే వీటిని నేను
ద్వేషిస్తున్నంత తీవ్రంగా
ద్వేషించనివాణ్ణి మరీతీవ్రంగా
ద్వేషిస్తాను
అసలు నేను వ్రాసిన కావ్యాలన్నింటిలో
ఈ ద్వేషగీతం చాలా బాగుందని
ఎవడైతే అనడో
ఆ దొంగతొత్తుకొడుకు మొగంమీద
ఉమ్మేతాను.

[అనువాదకుని గమనిక :- మూలంలో దీని శీర్షిక Critique de la poesie "కావ్యవిమర్శ" అని.]

# పబ్లిక్ రోజా

## (PAUL ELUARD) పోల్ ఎల్వార్

చలికాలం శాఖోపశాఖలతో
శవంవలె కఠినాతి కఠినం
సందొకటి జన సమ్మర్దంనుంచి
సన్నగా తప్పించుకు పోయింది
సందునిండా ఏకాంతం
అందులో ఒక బల్లమీద మనిషి
దారిచేస్తుంది సందు
దారుణ వేదనా కఠోర యంత్రాలకు
వెల్లుల్లి (జాబిల్లి) పాయలకు
కంకర రాళ్ళ కాలువలకు
ఘనీభవించని శిలావిగ్రహాలకు
సందుచేస్తుంది దారి
మంచితనాన్ని మరిచిపోవడానికి
సందుచేస్తుంది దారి
సాహసం సీసాలోని
సత్య సంస్కృతుల పీలికలకు
నల్ల వెలుగు పురాతన జ్వాల
అల్లకల్లోలంలో ఒళ్లు తెలియక
జుట్టు చిక్కుకొని వ్యూహంలో
దారి తప్పిపోయిన మనిషి
తలుపే పోలు కోలేడు
తాళం తియ్యనేలేడు
జ్ఞానం కావాలంటాడు
ప్రేమం కావాలంటాడు
వర్ణణలకు లొంగని శిథిల వైభవాలు
కాలవా కన్న జాలిగొలుపుతూ

పాపం వాటి కన్నాలలోంచి
పాడుకుంటూ ప్రవహిస్తాడు సూర్యుడు
పాలు చిలుకుతూ ఆకాశం
పాట పాడుతూఉంటే ఆకాశం
పాడుపడిన గోడలమీద
పాత కథలు పుష్పిస్తాయి
నీడలకు జోలపాడుతూ
నిర్మలమైన ఆలిచిప్పలు
వాటికింద తిరగబడే మంట
రక్తనాళాల మంట
అందుకో హస్తాల నాలోచించు నేత్రాల
ఆక్రమించుకో ప్రకృతిశోభను బలత్కారంగా
రాజుగారి దివాణం వెనుక
మూతపడ్డ దుకాణం వెనుక
కాళీ డబ్బాల పక్క
గంధపు కూజాల మాటున
మొగాడి ముందు
పరాగ నిర్మోకం విడిచి
పరుండిన రహదారి మీద
జ్వరాల గుర్రాలు లాగగా
అదే సుదినాల దండయాత్ర
నీలి బాకులతోట
తెరచుకొన్న కనుబొమ్మల క్రింద
గుబురుటాకుల గుంపులలో
సుఖం పండించిన బరువు పంట
పత్తిపువ్వు బురఖాలను చింపుతుంది
సారం తెలిసిన రంగు ప్రక్షాళిస్తుంది ముఖాలను.
భూతకాలపు పునీత దివసాలు
వాటి బాహువాసింహాలు వాటిని శుభ్రజలాల సౌధవాలు
గర్వించిన వాటిని ఉరుములు ఘడియలను బూళటిల్లజేస్తే

ఉషఃకాల
శృంఖలాల
ఉష్ణరక్త ప్రవాహాలతో
అన్నీ ఆకాశానికే అడ్డుగా
ఒకేఒక హృద్ధయపు
ఒకేఒక ముకురముద్గరంమీద
వాడి వైశార్య కిరీటం వసివాడిపోతే
కాని నేడు ఖర్చుబడ్డ వీధులకు
కడుంగడు దూరంగా
కాళరాత్రిని శాసించే ఈ పాట
కళ్ళు పొడిచి చెవులు చిల్లులుపెట్టే ఈ పాట
కటికచీకటి భూతాలకు కౌగిళ్ళిచ్చే ఈ పాట
ఈ ప్రేమ ఈ నిస్వార్థ ప్రేమ
బాగా తడిసిన కన్నీళ్ళతో
బాధతో గిలగిల్లాడే ప్రేమ
ఈ వికలిత విత్రుటిత విలులిత
మీ విచలిత మీ
వికటపు వేళాకోళపు స్వప్నం
ఉప్పొంగిన ఈ సంగీతపు వరద
వేడుకొనే ఈ వెలదుల సేన
వీలన ఈ లలన
హేమాన్ని ప్రేమించింది.
ప్రేమపు పరిపక్వతనే
జీవితమంతా కామించింది.

**After every war, poets of every Shade gather and philosophize.**

"పబ్లిక్ రోజా అంటే వీధుల్లో తిరిగి మానం అమ్ముకుంటేనేగాని దినం వెళ్ళని దీనురాలు. ప్రజల గులాబీ — వాడవడిన — చాలునా, ఇంకా స్పష్టంగా చెప్పాలా?"

— శ్రీ శ్రీ

# వాడిదే, ఇంకో గీతం

(**La Rose Publique** — "పబ్లిక్ రోజా" నుంచి, **A Personality Always New** — "అనుక్షణ నవీనమోహిని" అనే కావ్యశకలం దీనికి మూలం.)

కత్తులు
వాడిగా బలంగా
వాటికి బరువే లేదు

కత్తులు
పెనుగులాడే జనసమూహాన్ని
చీల్చుకుంటూ
అలిసిపోయినవి కొన్ని
డాబుగా దర్పంగా పోయేవి కొన్ని

కత్తులు రౌద్ర విగ్రహాలు
ఓరారపు కళ్ళ బికారులను
వెంటాడుతూ వేటాడుతూ

కత్తులు
అనంతాకాశంలో అంతిమ నక్షత్రాలు
గాలిలో ఖైదు తలుపుల్లాగ

కత్తులు
ఏడవడానికి ఎన్నటికీ
ఏడవకపోవడానికి

కత్తులు
ఉష్ణకాలపు పూల కౌగిలాలను
చీల్చి చెండాడడానికి
అన్నంటాగు నల్లగా తెల్లగా ఉండే
జీవితపుగళ్ళ పునాదులను
ఛిన్నాభిన్నం చెయ్యడానికి

కత్తులు
ఊపిరిమీద విషపాత్రికలాగు
వరదలబాధను కనిపెట్టే
ఉజ్జ్వల విషాదపు నగ్నబాహంవుల్లాగు
అర్థంలేనిదానికే అంతం తెలుసుకోవాలని.

# ఒకరో పలువురో

(PAUL ELUARD కి పాల్ ఎలార్డ్)

ఒకరో పలువురో
తుపానుపై నిద్రించే నీలిమ
పక్షులపై మంచు
కాతర కాననసీమల ధీతిధ్వనించే గణ గణ

ఒకరో పలువురో
మంటి ఆలిచిప్పలమధ్య మాలకాకుల్ని జల్లారు
మాసిపోయిన రెక్కలమీద భూకంపం చందువుమీద
గాలివాన గులాబీల ఎర్రని ఆశ్చర్యాలు సేకరించారు.

ఒకరో పలువురో
సూర్యుని వడ్డాణం
బ్రహ్మాండపు కూష్మాండం మార్తాండుడు
గుబురుతోటల సీసా మెతమీద

ఒకరో పలువురో
వానకన్న వెలుగు దినాలకన్న
బాల్యాన్నే స్పందిస్తూ
చల్లని నిద్దుర కనుమలకన్న చక్కగా స్పష్టంగా
చిడిముడిపాటుకు దూరంగా

ఒకరో పలువురో
అల్లరిబాజా అద్దాలలో
తెల్లారగట్ట వాళ్ళ అరుపు చీరలాగ చిరుగుతుంది

ఒకరో పలువురో
విసిరిన రాళ్ళతో వెదజల్లిన వెంట్రుకలతో చేయబడి
చేయబడి కంటకాలతో, బట్టలతో, మద్యంతో, నురుగుతో,
నవ్వుతో, ఏడ్పులతో. వదలిపెట్టిదంతో
ఆనందరప్పు ఆందోళనలతో

రక్తమాంసాలతో
నిస్పందేహంగా నిజమైన నేత్రాలతో నేయబడి
ఒకరో పలువురో
తమ సమస్త దోషాలతో, సమస్త సుగుణాలతో, సుగుణాలతో,
లలనాతతి
ఒకరో పలువురో
మొగానికి దంతపు బురఖా
అప్పుడే పండిన అన్నంలాగ ఆశపెడుతూ
నన్ను రెచ్చగొట్టే ఆడవాళ్ళంతా
అలంకృతలై అల్లసాని నాంచించిన దానితో
అలంకృతలై ప్రశాంతితో సరికొత్తదనంతో
అలంకృతలై ఉప్పుతో సీటితో సూర్యునితో
సారళ్యంతో, సాహసంతో, ఒక వెయ్యి చిరిపిదనాలతో
ఒక వెయ్యి గొలుసులతో
ఒకరో పలువురో
నాకల లన్నిటిలో
ఒక కొత్త అడవిపువ్వు
కట్టెమోపులవంటి కింజల్కాల అనాగరిక పుష్పం
గాయపడ్డ చీకటిలో
ఒకరో పలువురో
మరణించతగిన యౌవనం
క్రూరం ఘోరం అశాంతిమయమైన యౌవనం
చిరాకులతో వదదలెత్తే యౌవనం
నాతో పంచుకుంది
నా ఒక్కడితోనే
ఇతరుల లెక్కలేకుండా!

# విషాదనగరం

**(PAUL ELUARD)** పాల్ ఎలార్డ్

మరుగుజ్జులు లేని
మధురమైనహృదయ విదారకాలు గాని
ఎడారి దారుల్ని చూపించే
ఎర్రని గంధర్వ కాంతలతో నిద్రిస్తాం మనం
నిద్రిస్తాం మనం
ఒక రెక్క మనల్ని బద్దలుకొట్టింది
ఎక్కడికో పోతాం మనం

ఎగిసిపోయిన ఎరకలకన్న
వయస్సు మించిన చక్రాలు మనవి
దారి కనబడదు మనకి
శనైర్గమనపు శ్మశానాలలో
సాగించాలి మన అన్వేషణ
అదొక్కటే మనకు మిగిలిన
ఇంద్రియ లోలత్వం
మన గాయాలకి కట్టిన కట్లమీద
కప్పుకొనే సీసా
ఎప్పుడూ ఈర్ష్యని ప్రతిఘటించదు
తీసుకో హృదయాల్ని మస్తిష్కాల్ని
ఆగ్రహ కందరాల్ని
తీసుకో పాలిపోయిన బాలికల
ముడులుపడిన బాలకుల
అదృశ్య పుష్పాల్ని
అందుకో స్మృతిహస్తం
మూసుకో జ్ఞాపకాల కళ్ళు
బందిపోట్లు కల్పించిన వృక్షశాస్త్ర సూత్రాలు
మనల్ని కొట్టి విభజిస్తాయి

అన్ని ముక్కలూ మంచివే
వీటిని మళ్ళీ ఏకంచేసే దెవరు
భయమూ బాధా అసహ్యమూ
ఇక నిద్రపోదాం సోదరులారా
ఇదివరకు వ్యాఖ్యానించలేని అధ్యాయం
ఇప్పు డర్థమే కాకపోతోంది
మహారాక్షసులు కదుల్తున్నారు
భయంకరంగా ఊపిరితీస్తూ
మహారాక్షసంగా ఊపిరితీస్తూ
ఉషస్సులాగ అరుస్తూ
అరవడం మానలేని ఉషస్సు
ఆనాటినుంచీ సోదరులారా
ఆనాటినుంచీ.

# నౌకాయానాల తర్వాత

## (PAUL ELUARD పోల్ ఎల్వార్)

దూరదేశాల నౌకాయానాల తర్వాత ఈ రేవునే చూస్తానెప్పుడూ ఇంకోసారి ఈ వసారాని ఈ వెచ్చని నీడని సముద్రపునురగ చల్లగాలుల చనుబాలిస్తుంది. మళ్ళీ చూస్తాను మన గదిని నీతోకలిసి మన కోరికల వంట వార్చే గదిని ఎప్పుడూ చూస్తాను నీ నగ్నత్వపు నీరసం తెల్లవారుజామున కరిగిపోయే చుక్కల్లో కలిసి పోతుంది. ఔను నేనెరుగుదును కళ్ళు మూసుకుని చూస్తే చాలు కనిపిస్తాయి. నిన్ను సమీపించనిచ్చే వన్నెవన్నెల విలాసాలన్నీ జ్ఞాపకం వస్తాయి. మళ్ళా కళ్ళు విప్పితే మరోమూల కుళ్ళిపోతున్న గొడుగు మంచి రోజులమీద నమ్మకాన్ని సూర్యుడిమీద జీవితంమీద నమ్మకాన్ని భగ్నం చేస్తుంది. వెలుతురులో నిన్నింక ప్రేమించలేను నిన్ను వెదుక్కోడానికి బయల్దేరిన రోజు బాధపెడుతోంది నా గుడ్డితనం నా మూగతనం ఈ బోధపడని ప్రపంచం ముందు నువ్వు ప్రోత్సహించే అంగీకారం ముందు.

నీ చిలిపిచేష్టలచేతనే నీతో పోరాడిస్తున్నానంటే నా నిజాయితీలో నువ్వు కూడా ఎందుకు వాటా తీసుకోవు?

ఎంత నన్నేడిపించావు కావు? ఇక నీ దగ్గర కెప్పుడైనా వస్తే ఏం కనుకున్నావు? రాత్రికంటె ఎక్కువ వైశాల్యంలేని అర్థంలేని నా జీవితపు మహా రహస్యాన్ని తడిమి చూసుకొని ధైర్యం తెచ్చుకోవడానికి నేను వచ్చిరాగానే పడవలన్నీ ప్రయాణం కడతాయి వాటినిచూసి తుఫాను వెనుకంజ వేస్తుంది జడివాన విడిపిస్తుంది పేరులేని పువ్వుల్ని వాటి పునర్వికాసం దూదిగోడలమీద ఎదురుదాడి చేస్తుంది ఔను నేను ఎరుగుదును నీకో నిశ్చయం లేదు కాని మన మధ్య అఖాతం బతకలేదు మనం చేసే పొరపాట్లు మనకన్నా మర్యాదగా బతగ్గలవు ఎన్నాళ్ళనుంది ఈ తలుపు తెరుచుకోవడం నిరాకరించింది ఎన్నాళ్ళయింది ఆశ నిరాశ కాహారమై ఎన్నాళ్ళయింది నీ చిరునవ్వు కన్నీళ్ళుగా మారి.

ప్రేక్షకులకు లోనికి ప్రవేశం లేదన్నాం ఏముందిక్కడ చూడడానికి జ్ఞాపకం వుంచుకో ఒకతెవే ఉన్నప్పుడీ జనంలేని సంగీతంలేని రంగస్థలాన్ని ఇంతే ఈ జీవిత నాటకం ప్రపంచరంగం ఇక్కడ మనిద్దరం మాత్రం ఏమిటో. దీని అర్థం మనిద్దరం అదే మాట వేరువేరు నౌకాయానాల వేళలలో ఆగిన వేరువేరు రేవులలో మనం ఇద్దరం కలిసే వున్నాం నిజం కలిసే ఉన్నాం నాకు తెలిసింది కలిసే ఉన్నాం మనిద్దరం కలిసే ఉన్నాం మనం నీకూ తెలియదు నాకూ తెలియదు మనిద్దరం విడివిడిగా వున్న వేళలకి ఇద్దరం కలిసి మెలసి ఉన్న వేళలని కలపడం ఎలాగో నీకూ నాకూ తెలియదు నీలోనుంచి నన్ను నాలోనుంచి నిన్నూ తీసివెయ్యడం ఎలాగో.

నువ్వూ నీడవి నేనూ నీడని కాని ఈ నీడలోనే మనం ఇద్దరం అని మరచిపోతాం!

# జోన్ (యుద్ధరంగం)

(ఫ్రెంచినుంచి అనువాదం)

కుళ్ళిపోయిన ప్రపంచంతో విసుగెత్తిపోయింది నీకు
కుతుబ్ మినార్ ఈ ఉదయం గోల చేస్తూ అరవబోకు
నీ వంతెనల గొంతుకలతో నీ గొర్రెల మందలతో
వేదాల పురాణాలనాటి వెర్రి కలల వందలతో
ప్రాచీన రథాల బార్లు
ఇచ్చటి మోటారుకార్లు
ఇక్కడ మతం ఒక్కటే నవీనం తతిమ్మా సమస్తం దగా
మతం ఒక్కటే ఋతం, శాశ్వతం, విశాలమైన విమా
నాశ్రయంలా అమాయకం
భారతదేశంలో బుద్ధు డొక్కడే బతికున్నాడింకా
ఈనాటి అతి నవీన కవి ఒక్క శ్రీ శంకరా
చార్యుడే, కంచి కామాక్షి గోపుర ద్వారాలు
తెరుచుకున్నాయి పిల్చివెయ్యాలని నీ పాపాలు
నువ్వుమాత్రం సిగ్గుతో ఒప్పుకోవు నీ దోషాలు
నువ్వుమాత్రం చదువుతావు గోడలమీద సమాసాలు
జీవిత భీమా కరపత్రాలు; షేరు మార్కెట్ తమాషాలు
ఇదిగో నీ న్యూస్ పేపరు—ఇవాళ ఉదయపు సరికొత్త కవిత్వం
అణా డబ్బులికి కొనుక్కో హత్యలూ అసత్యాలూ పశుత్వం
సారస్వతానుబంధంలో ప్రముఖుల జీవిత విశేషాలు,
కొత్త కొత్త ఆకర్షణలు—కోటి కోటి విచిత్ర శీర్షికల పతాకాలు
ఇవాళ ఉదయం చూశానొక యెంచక్కటి వీధి ఏమిటి చెప్మా దాని పేరు
సూర్యుడిలో తడిసి శుచిగా శుభ్రంగా ఉంది శంఖధ్వని దానినోరు
డైరెక్టర్లు కార్మికులు అందమైన టైపిస్టు అమ్మాయిలు
ఆ వీధిలో నడుస్తారు సోమవారం ఉదయం మొదలు

శనివారంరాత్రిదాకా రోజుకు నాలుగు పర్యాయాలు
ముమ్మారు ప్రతి ఉదయం మూలుగుతుంది సైరన్ మంట
మధ్యాహ్నం సరికి వినబడుతుంది మతి చెడిపోయిన గంట
షాపుల మొగాలమీద సాహిత్యం గోడలమీద సంగీతం
చిలకలాగ చెప్పిందే చెప్పే ఈ పారిశ్రామిక వీధిని చూడ్డం ఎంతో
నాకు సంతోషం.

మళ్ళీ నీ చిన్నప్పటి వీధి, నువ్వో చిన్న బొమ్మప్పుడు
నీలిలాగూ తెల్లచొక్కా తొడిగింది మీ అమ్మప్పుడు
దినదినం దేవుడి గుడికి ఈ వీధంటే వెళ్ళావు
నీతో ఒక నేస్తం నీ భక్తికి హద్దుల్లేవు
దేవుణ్ణి మించిన రహస్యం లేనేలే దా రోజుల్లో
రాత్రిపడ్డాక చీకట్లో కునుకుదీపం వాకిళ్ళల్లో
అమ్మపక్కని నిద్రించి అవేవేవో ప్రార్థనలు
మర్నాడు స్కూల్లో ఘాస్టరు ఆయన ప్రాతఃకీర్తనలు
మహాశివుని స్తోత్రం
అతని మండే మూడోనేత్రం
అతని కాలసర్పపు ఫణామణుల కాంతుల దివ్య సౌందర్యం
విస్ఫారిత మహాపద్మం వేయి కిరణాల వైడూర్యం
అతని ఆర్పలేని దీపం వాల్చరాని బావుటా
ఎన్ని గాలులు వీచినా ఎదిరించి నిలచే సింహాల జూలుకాగడా
అతడే క్రీస్తుకూడా అమ్మకి పుట్టిన కొడుకు
అతనే ఒకచెట్టు దాని చిటారు చివర ప్రార్థనల చిగురు
అవి కాలం ఖర్మం కలిసిన జంట జంటల జటాజూటాలు
అది ఆరు కోణాల నక్షత్రం మూడు మొనల వాలు
శుక్రవారం చచ్చిపోయి ఆదివారం బతికే యేసు
వైమానికులందర్నీ మించి మీదిమీది కెగిరే క్రీస్తు
ప్రపంచపు విమాన రికార్డు పరమేశ్వరుడిదే
నా కంటిపాప క్రీస్తు ఇరవయ్యోపాప ఇంకా ఎన్ని శతాబ్దాలకైనా
శంకాతంకాలు లేకుండా ఒంటరిగా ఎగిరేమైనా

ఈ శతాబ్దం మారింది పిట్టగా ఎగురుతోంది ఈశ్వరుడి
సింహాసనం దిక్కుగా
గోతుల్లో దయ్యాలు మెడలెత్తుక చూస్తాయి నిక్కుగా
దేవుడి దేవుడికి ఇమిటేషన్ అన్నారు లోగడ
ఎగురుతాడా అయితే - ఈగ అయినా నంబర్‌వన్ ఈగట

గంధర్వులూ కిన్నరులూ కింపురుషులూ ఈ యెగిరే ట్రెపీజిస్టుచుట్టూ
ఎగురుతారు ఈ మొట్టమొదటి విమానం తట్టు.
రెక్కలు ముడవకుండానే దిగుతుంది ప్లేను
లెక్కలేని పిట్టలతో నిండిపోతుంది సీను.
ఆకాశం అనంతం అందులో పక్షులు అసంఖ్యం
కాకాలు ఘూకాలు ఫాల్కన్లు పుంఖాను పుంఖం
ఆఫ్రికానుంచి ఐబిస్‌లు మారబౌట్లు ఫ్లెమింగోలు
కవులు పాడే గంతభేరుండం అరేబియన్ నైట్లరాక్పక్షి
ఆది మానవుడి కపాలం గోళ్ళ యిరుకుల్లో ధరించి
అమెరికానించి వస్తుంది చిట్టి చిట్టి హమ్మింగ్ బర్డు
చీనానించి పిహీలు సిల్కు రెక్కల గరుడులు
వాటి వింగ్ స్పాన్ ఒక్కటే - ఎగరడం రెండేసి చొప్పున
దివ్యమైన సింబాలిజం - అయినా బోధపడదు చప్పున
ఇదిగో ఇది పావురం అనశ్వరం అజేయం
ఫైరు బర్డూ దాని అంగరక్షకుడు లక్షకళ్ళ మయూరం
చితిమంటల్లోంచి లేస్తుంది రెక్కలాడిస్తూ ఫీనిక్సు
గ్రీకుపురాణాల సైరెన్లు వాటి సమ్మోహనకరమైన మ్యూజిక్కు
డేగా గూబా ఫీనిక్స్ పీహీ కాండర్
అన్నిటికి స్నేహితుడే ఈ ఎగిరే వండర్
ఇవాళ పారిస్‌లో నడుస్తున్నావు ఒంటరిగా జనాలమధ్య
ఆలమందల్లా అరుస్తూ బస్సులు సాగుతున్నా యీరధ్య
పాత ప్రేమల బాధలు నీ గొంతుపట్టి పిడిస్తున్నాయి
ప్రేమించనే ఇక లేనేలేవనే భయాలు నిన్నీడుస్తున్నాయి
ఏదైనా మహర్షి ఆశ్రమానికి పోదామని ఉంది, నీకు

కాని ఇప్పుడు నువ్వు జపించే గాయత్రి నీ గుండెల్లో బాకు
చిరాకుపడతావు నువ్వు నీ నవ్వు కాగితం పువ్వు
నరక జ్వాలలాంటి నవ్వు వెలిగిస్తుంది నీ లోపలి దీపం
వెలుతురులేని చిత్రకళా ప్రదర్శనశాలలో ఒకరూపం
అదే నీ అంతర్జీవం దగ్గరసా వెళతావు దానికోసం

ఇవాళ నడుస్తున్నా ఏ నగరంలో ఆడకళ్ళు నిన్ను చూడవు
అందాలు నిన్నాకర్షించవు ఇవాళ నువ్వొక నీడవు
ప్రచండమైన నీ హృదయరక్తం ముంచెత్తింది నన్ను
పవిత్రమైన ప్రార్థన గీతాలు విరుస్తున్నాయి నా వెన్ను
ఏమిటనుకున్నావు నా ప్రేమ అదో సిగ్గుకలిగించే జబ్బు
నీకు నిద్రరాదు నా చుట్టూ భ్రమగొలిపే జ్ఞాపకాల మబ్బు
ఇంతట్లో కనబడ్డావు కావేరి నదీతీరంలో
చివురించిన చెట్లకింద స్నేహితులతో దూరంలో
షికారుగా వెళ్ళారు మీరు నదిమీద బోట్లో
దేవుని మొదటి అవతారం చేప కనబడింది నీట్లో
ప్రాగ్ నగరంలో హొటేలు, దానిచుట్టూ ఒక తోట
టేబిల్ మీద గులాబిపువ్వు దాన్ని చూడ్డం నీకో ఆః
వచనంలో నీ జీవితాన్ని వడగట్టడానికి బదులు
పరధ్యానంగా చూస్తావు నీకు కనబడుతుంది పువ్వులోని పురుగు
భయపడిపోయి చూస్తావు దేవాలయంలో విగ్రహాన్ని
నీ కళ్ళు జాలిగా తోడుకుంటాయి పరమేశ్వరుడి ఆగ్రహాన్ని
లాజరస్‌వి అయావు నీవు నీ ఒళ్ళంతా కుళ్ళు
కుడినుంచి ఎడమకి తిరుగుతున్నాయి గడియారం ముళ్ళు
మళ్ళీ నీ జీవితంలోకి మెల్లగా జారుకుంటావు
పల్లెల్లో పదాలు వింటావు వెల్లుల్లి తిలపిష్టం తింటావు.
ఇదిగో ఇది ఇంకో వూరు
ఇంకో హోటల్
ఇంకో దేశం
ఎన్ని నగరాలు చూశావు ఎంత ప్రయాణం చేశావు.

మళ్ళీ నీ స్వగ్రామం నిలుచున్నావు జడ్జీ సుందర
నేరం చేసిన ముద్దాయివి శిక్ష వినాలని నీ తొందర
చాలా ప్రయాణాలు చేశావు సంతోషంగా దుఃఖంగా
సంవత్సరాలు పెరిగాయి నీమీద అబద్ధం కనపడింది అందంగా

ఇరవయ్యో ఏట ప్రేమనీ ముప్ఫయ్యోఏట ప్రేమనీ
చవిచూశావు నువ్వు తెలిసింది వాటిరుచి చేదని.

పిచ్చివాడిలా బతికాన్నేను వ్యర్థమైనాయి నా దినాలు
చూడలేవు నీ చేతులు ఆగబోవు నా కన్నీళ్లు
చూశావా ఈ కాందిశీకుల్ని అందరూ మనలాంటివాళ్ళే
దేవుణ్ణి నమ్ముకున్నారు వీళ్ళు వాళ్ళవీ మనలాంటి కళ్ళే
కష్టపడి పెంచుకొస్తున్నారు బిడ్డల్ని రైలుస్టేషన్లలో చెట్లకింద
ఎప్పటికైనా మంచిరోజు లొస్తాయనుకొంటున్నారు ఏముంది దీన్లో వింత

ఇంకో చోటికి పోయి బతకాలని
ఎలాగైనా ధనం ఆర్జించాలని
తర్వాత ఇంటికి వచ్చేసి సుఖించాలని ఆశ
బండమీద పచ్చడి నూరుతోందా అమ్మాయి
నీ గుండెల్ని నువు నూరుతున్నంత సులువుగా
ఆ పచ్చడీ నీ గుండెలూ మన స్వప్నాలూ అన్నీ మిథ్య
కాందిశీకుల్లో కొందరిక్కడే ఉంటారు మన మధ్య
చదరంగంలో బలంలాగా అరుదుగా కదుల్తారు
ఏదో వ్యాపారం చేస్తారు ఎలాగో బతుకుతారు.

సారాకొట్లో దూరేవు అలగాజనంతో చేరేవు
రాత్రి పెద్దవాళ్ళ పేట్లోకెళ్ళి రాక్షసుడివిగా మారేవు
పెద్దవాళ్ళ కారిస్త్రీలు తేలికకాదు వీళ్ళమోసే బరువు
అందరూ తమ ప్రియులకి కష్టాలే కలిగించారు

అదిగో ఆ అమ్మాయి ఒక చిరుఉద్యోగి కూతురు
ఆమె శరీరంపుమీద కత్తిని ఎవరు చేసారు కాతరు

అదుగో ఆ నల్లపిల్ల ఆమె నవ్వు అసహ్యం
తలవంచాను న్రమంగా ఆమె దుఃఖం అనూహ్యం

ఒంటరిగా మిగిలిపోయావు వెంటనే ఉపయం వచ్చింది
పగలు చేసే చప్పుడు నగరంనిండా హెచ్చింది

నిశీధం పట్టుకుపోయింది నీకు నచ్చిన ముఖాలను
హాలాహలంలా మండే ఆల్కహాల్ సేవిస్తావు
అందులో కాలిపోతున్న నీ దినాలను చూస్తావు
ఒక్కొక్క వీధిలో ఒక్కొక్కడు కనబడతాడు
అందరిలోనూ దేవుణ్ణే చూస్తావు

చాలుచాలు పోదామ్మరి సాయంత్ర మయిపోయింది.

**Guillaume Apollinaire**

రచనకు అనువాదం

# ప్రణయం - స్మరణం (అసంపూర్ణం)

"రాట్టివలె నిశ్చలములగు వస్తువులు కలవు."

ముద్దొచ్చే పరిగణాంలో
(మరీ ముద్దొచ్చేవి మాత్రం కావు)
హఠాత్తుగా అతి మర్యాదగా లంకించుకొనబడి
వలస రాజ్యాల పలుకుబడి కలిగి
ఒక బురఖా
వడ్డీవలె రాబట్టుకొనబడి
ఏమయితే నేం
తలకిందులయి
ఏమయినా ఈ రాజ్యంతో
ఎందుకు మనకి పేచీలనుకొని
అయితే ఈ వలస రాజ్యంలో
అజమాయిషీ చేసే ఆఫీసు బెత్తాలు
ఇంకేవో అస్పష్టపు అసందర్భపు
ఆఫీషియల్ వస్తువులు
అన్నంలాగ పనిచేస్తూ
బాగా వండిన అన్నంలాగ
ఏడుపును పోలిన అన్నం
పిట్ట గూటిని పోలిన ఏడుపు
మూడు రంగుల్లో ముద్రించిన పిట్టగూడు
నా కవిత్వాన్ని సరిపోలినదై
నేను భయంకరంగా ధరించే కవిత్వం
షరతులున్నా సరే
లేకపోయినా సరే
వలస రాజ్యాల బురఖా ధరించిన వస్తువులు
**ఏకీభవించి**

శక్తివంతంగా నైనా సరే
కాకపోయినా సరే
ఒక్క అంచుమాత్రం కలిగి
లేక
దవడ యెముకలు కలిగి
లేక
నాటకపు దుస్తులు కలిగి
లేక
తీగమీద నడవడం కలిగి
లేక
సగం వస్తువులు కలిగి
లేక
బోర్లించిన వస్తువులు కలిగి
లేక
తాళపుచెవి కలిగి
లేక
అనేక సదుపాయాలు కలిగి
లేక
మా అక్కయ్య ఫోటోగ్రాఫు పక్కని
సూదీ దారం కలిగి
అడుగు బద్దా
అన్నం మెతుకులూ కలిగి

మూలం : సాల్వడార్ డాలి
(Salvador Dali)

# పుట్టని పాప ప్రార్థన

నే నింకా పుట్టలేదు: నా ప్రార్థన వినండి
గాలిదూళి మహామారి
బాలారిష్టాలు లేని
గద్ద గుడ్లగూబ రాని
గబ్బిలాలు జడిపించని బతుకివ్వండి

నే నింకా పుట్టలేదు; ఓదార్చండి
గోడలలో గోడలతో కుమ్మికుమ్మి
నల్లమందు నిషాలలో ముంచిముంచి
అబద్ధాల కుతంత్రాలు కురిసి కురిసి
జైళ్ళలో చిత్రవధ
రైళ్ళలో దోపిడి
మీ యుద్ధాలకు నన్నొక బలిపశువును
చేస్తారని భయం. దాన్ని పోకార్చండి.

నే నింకా పుట్టలేదు; నా కోసం
వానలు కురిపించండి
పంటలు పండించండి
ఆడుకొనే చెట్లూ
పాడుకొనే ఆకాశం పక్షులతో స్నేహం
నా దారికి వెలుగిచ్చే తెల్లని దీపం
నా మనస్సు వెనకాతల వెలిగించండి

నే నింకా పుట్టలేదు; క్షమించండి
నా ద్వారా ప్రజలు చేసే పాపాలూ
నా పేరిట జరగబోయే మోసాలూ
నే నాడని మాటలు, ఊహించని తలపులు
నే నెరుగని ద్రోహాల కుట్రలు
నా చేతులతో చేయించే హత్యలు
నా నాలుకతో పలికించే దొంగసాక్ష్యం
ఇతరుల బతుకుల ఫలితంగా నా మరణం
నా బతుక్కి ఫలితంగా ఇతరుల మరణం
నా భావి బాధ్యతల నన్ను మన్నించండి.

నే నింకా పుట్టలేదు ; మీరే చెప్పండి
ఏ పాత్ర ధరించాలో
ఏ మాటలు పలకాలో
ముసలివాళ్లు నాకు నీతి బోధిస్తే
ప్రభుత్వాలు నా నడవడి శాసిస్తే
పర్వతాలు తమ కోపం ప్రకటిస్తే
నన్ను చూచి హేళనగా ప్రేమికులు
రారమ్మని పిలిచే పెనుకెరటాలు
నా శవాన్ని నాశనాని కెం చేసే ఎడారి
నా బిచ్చం పుచ్చుకోని భిక్షకుడు
నేనేం చెయ్యాలంటారో మీరే చెప్పండి

నే నింకా పుట్టలేదు : నా ప్రార్థన మదినుంచండి
పశుప్రాయుడైనవాడు
భగవంతుణ్ణనేవాడు
నా కుభయుల సంపర్కం వదిలించండి

నే నింకా పుట్టలేదు : నా కివ్వండి
నాలో గల మానివత్వ మెవరైతే అపహరించబోతారో
ఎవరైతే
నన్నొక యంత్రంగా మార్చాలని యత్నిస్తారో
బజారులో నన్నొక సరుకుగా
మొగాని కొక ఖరీదు తగిలించి
నా అస్తిత్వం ఎవరైతే చీల్చాలని చూస్తారో
అటూ ఇటూ
ఇటూ అటూ బంతిలాగ తంతారో
ఎవరైతే
నన్నొక నిర్జీవపు శిలనుచేసి
ఎవరైతే ఎవరైతేనేం వాళ్ళని
ప్రతిఘటించగల శక్తిని నాకివ్వండి
ఈ షరతులమీద నన్ను రానివ్వండి
లేదా నన్నీ క్షణమే చావనివ్వండి

# ప్రేమ గీతం

## (జేమ్స్ జాయిస్‌కు ఇమిటేషన్)

ప్రేమ ప్రేమను ప్రేమించడాన్ని ప్రేమిస్తుంది
ప్రేమ ప్రేమను ప్రేమగా ప్రేమిస్తుంది
ప్రేమను ప్రేమించిన ప్రేమ ప్రేమచే ప్రేమించబడిన
ప్రేమను ప్రేమిస్తుంది

నర్సు కొత్త డాక్టరును ప్రేమిస్తుంది
14 నం. కనిష్టేబు మేరీ కెల్లీని ప్రేమిస్తాడు
హంటర్‌వాలా హంటర్‌వాలీని ప్రేమిస్తాడు
నాయకులు నాయికలను ప్రేమిస్తారు
మనవాళ్ళయ్యే వాళ్ళవాళ్ళమ్మను ప్రేమిస్తాడు
సరోజాబాయి సైకిలుమీద వచ్చిన కుర్రాణ్ణి ప్రేమిస్తుంది
వీధికొసను అమ్మాయి గోడచాటున అబ్బాయిని ప్రేమిస్తుంది
చీ చీ చీ చీనావాడు చౌ చౌ చౌ చీనీదాన్ని ప్రేమిస్తాడు
ముసుగు మనిషి చచ్చిపోయిన మనిషిని ప్రేమిస్తుంది
మహారాజుగారు మహారాణీగారిని ప్రేమిస్తారు
మహిషం మహిషిని ప్రేమిస్తుంది
నువ్వు ఒకానొకర్తెను ప్రేమిస్తావు
ఆ ఒకానొకర్తె ఇంకొకానొకర్ని ప్రేమిస్తుంది
భగవంతుడు అందరినీ ప్రేమిస్తాడు

# ఛాయాభంగిమలు

జీవితానికి ప్రాముఖ్యం యివ్వను
జీవితపు కనీసపు పిపీలికలకు ప్రాముఖ్యం అంటించను
జీవితానికి నా లక్ష్యంలేదు.
కాని లవణ శాఖికలు ధవళ శాఖికలు
ఛాయా బుద్బుదాలు
సముద్రపు పలక పుల్లలు
నా ఊహాలలో ఊపిరి తీసుకోవడానికి దిగుతాయి
నావి కాని కన్నీళ్ళలోంచి వస్తాయి
నేను వెయ్యని అడుగులలోంచి
రెండు పెట్టి గుణించిన అడుగులలోంచి
వాటినిగూర్చి యిసుకప్రోవులు కెరటాల రాకను స్మరిస్తాయి
పంజరం లోపల యినుపకమ్ములున్నాయి.
ఈ కమ్ముల ముందు పాడాలని పక్షులు
ఆకాశపు దూరంనించి దిగుతాయి
భూగర్భమార్గం పరిమళా లన్నింటినీ ఏకం చేస్తుంది
అక్కడ వొకనాడు నాకొక స్త్రీ వాగ్దానం ఇచ్చింది
ఈ మగువ మహా ప్రకాశమానంగా వెలిగి
నాకు కనబడనే లేదు
ఈ కళ్ళతో
కాలిపోతూన్న నా తనువును కనిపెడుతూన్న ఈ నా కళ్ళతో
ఆమెను చూడలేకపోయాను.

అప్పటికే నాకు యిప్పటి వయస్సుంది
బ్రహ్మాండమైన ఫ్యాక్టరీని రాత్రి పారాజవానులాగ
నన్నూ నా ఊహాలనూ కనిపెడుతున్నాను
ఒంటరిగా పారా యిస్తూ
అవే ట్రాం పట్టాలను యెల్లప్పుడూ అదే సర్కస్ సమ్మోహితం చేస్తుంది

మట్టిబొమ్మల ముఖలక్షణాలేవీ మారిపోలేదు
చిరునవ్వు ఫలాన్ని కొరికినవాళ్ళు
మరిచిపోయిన నగరంలో మంచి బట్టలషాపు వెదుకుదును
ఆ బట్టలు వేసుకుని నీకు కనబడాలని అడిగావంటే
నీ అంతం సమీపించిం దనుకుంటావు,
నా అంతంలాగే
ఆఖరికి ఉత్థానాలకి అర్థమవుతుంది ఔత్థానా అనకూడదని
తోడేళ్ళు మంచుటద్దాలని తొడుక్కున్నాయి
ఏ ఋతువుకీ చెందని వొకపడవ నాకుంది
మంటకోరల మంచుబిలంండి నన్నులాగుతోంది
ఎప్పుడూ పచ్చగానే వుండే ఈ చెట్టునుకోస్తూ ఈడిగిలబడతాను
వైణికుడు తన వీణ తీగెలలో చిక్కుకున్నాడు
పెద్దబాలశిక్ష కథలో పేదరాశి పెద్దమ్మ
ఇంతవరకు నీడలాగే ఉన్న ఓడనెక్కి పోతుంది
బహుశా ఈ కత్తి కొకపిడి ఉందేమో
కాని ఈ పిడిలో అప్పుడే కలహం
ఈ పోరాటంలో వీరులకి ఆయుధాలు లేవు
మృత్యువు పెద్దనేరం కాదు
భవిష్యత్తు యెప్పటికీ రాదు
ఎన్నడూ ఎత్తబడని తెరలు
ఇకమీద కట్టవలసిన యిళ్ళు కిటికీల దగ్గరకు తేలుతూ వస్తాయి
కలువపూలతో కట్టిన శయ్యలు
ప్రాలేయ దీపికలకింద జాలువారుతాయి
ఒకానొక సాయంత్రం వస్తుంది
నీలినాచుకింద వెలుగు ముద్దలు నీరవిస్తాయి
ప్రేమనీ గాలినీ ముడివేస్తూ ముడివిప్పే చేతులు
కళ్ళున్నవారు చూడగలిగినట్లు తమ స్ఫాటికత్వం నిలుపుకుంటాయి
అరచేతుల రేఖల్ని
కళ్ళతో కిటికీల్ని చూస్తారు

కాని కిరీటాలూ అరచేతులూ
అరణ్యంలోని అగమ్యస్థానాల్లో వెలిగించబడవు
సంవత్సరాల్ని పరీక్షించడానికి సారంగాలు, శిరస్సులు వంచేచోట్ల
మంద్రాతి మంద్ర ధ్వనులు మాత్రమే వినిపిస్తాయి
ఆ ధ్వనులనుండి అనేకమైన చల్లచల్లని
పెద్ద పెద్ద చప్పుళ్ళు సాగుతాయి
ఆ వాద్యం అనంతంగా మోగుతూనే వుంటుంది.

స్పందించే చీరలు
ఆ స్పందనాలతో శ్రుతి కలిపే వాద్యం
వాటిని ధరించినవారి ముఖాల్ని చూడాలనుకుంటే
వొక గొప్ప పొగమబ్బు నేలనుండి లేస్తుంది
ప్రాకారాలకి అడుగున
జీవితానికీ ఐశ్వర్యానికీ కాణాచులైన ఉగ్రాణాల వెనుక
రెండు కొండలమధ్య దాక్కునే లోయలలో
సూర్యుడు చల్లారిపోయే సమయపు సముద్రంమీద
నాకు సంజ్ఞలు చేసేవారిని నక్షత్రాలు వేరుచేస్తాయి
అయినా అమిత జవంతో పోతూన్న శకటం టోల్తాపడి
నా అంతిమ సంకోచందాకా తీసుకుపోతుంది
ఆ సందేహం నా కోసం వేచుకుని ఉన్న నగరంలో
కంచు విగ్రహాలూ శిలావిగ్రహాలూ
మైనపు విగ్రహాలతో మార్పుకు పాల్పడ్డాయి
మర్రిచెట్లు మర్రిచెట్లు

[అధివాస్తవికోద్యమ నాయకుడు **Andre Breton** వ్రాసిన
**Le Revolver aux Chevevx Blance**
'తెల్లవెంట్రుకల రివాల్వర్'—నుంచి]

# దిగుమతి చేసిన వచనగీతాలు
(అంతరంగంలోని ఆకాశం నుండి)

## నేపథ్య సంగీతం

గోరుచుట్టు ప్రాణాంతకం.

అంతకన్నా ప్రాణాంతకం జాంఘతీరా అరవలేకపోవడం.

హాోటేల్లో ఉన్నాను. అటూ ఇటూ గదుల్లో మనుష్యులు నిద్రపోతున్నారు.

రాత్రి పెరుగుతోంది.

అరవడం ఎలా?

అందుకని ఓ తమాషా చేశాను. నా మొనడు వొలిచి పీపాల్లాంటి బాజాలూ, పాపాల్లాంటి బాజాలూ పైకి తీశాను. నా బ్వరంవల్ల రెండింతలైన శక్తితో వాటి లోంచి ఇల్లె గరగొట్టే సంగీతం పెల్లగింటూను.

ఆ చప్పుడులో నా అరుపులు వినబడవుగా!

ఇప్పుడు గొప్పగా అరుస్తున్నాను.

ఇప్పుడు నొప్పి కొంచెం తగ్గింది.

## సృష్టి

రొట్టెముక్కతో చిన్న జంతువుని చేశాను.

ఎల కిసుకుంటాను.

ఔను, ఎలకే! చిట్టెలక!

రెండుకాళ్ళు పూర్తిచేశాను.

మూడోకాలికి పాదం తయారుచేసే లోపుగా చిట్టెలుక చీకట్లోకి పారి పోయింది.

## ఇంద్రజాలం

"కాఫీ తే!"

సర్వర్ వెళ్ళాడు.

చాలామంది తింటున్నారు. నా సరదా పోరాటం.

"ఏమండోయ్, బాగున్నారా?" అని నేను పలకరించను. కింద దవడ [illegible]

అడుగో మీసాల ఆసామీ !

"ఏమండోయ్, బాగున్నారా ?"

ఆసామీ దవడ అతికించుకుంటున్నాడు.

మీదపడ్డాను. ఓ కుమ్ము, ఓ గుమ్మ, ఓ గలీతా !

మొగ్గలేస్తూ మీది కెగిరాడు.

నిచ్చెనపట్టి కిందికి దించాను.

బండమీద ఉతికేను, పిండిపిండిగా పిసికేను, బల్లమీద పరిచేను.

ఇంకా బతికేవున్నాడు.

వీల్లేదు. వీడి అంతుచూడాలి, ఒక్కచూపుతో వీడి మొత్తం కూడిక చేశాను. నన్ను నాలుగుతో హెచ్చవేసుకున్నాడు. కొట్టేశాను అరే! మళ్ళీ నిలబడ్డాడు : రెచ్చిపోయాను. వీడి తల వెయ్యిచెక్కలు చెయ్యవలసిందే :

విసిరాను చెయ్యి !

సర్వర్ తెచ్చిన కాఫీగ్లాసు ముక్కముక్కలయింది.

## నామీద ఫిర్యాదు

నేను చెప్పినప్రకారం చెయ్యనట.

ఏం చెయ్యను ?

దారుల కూడలిదగ్గర రాటబల్ల మీ ఊరు ఎటుందో చెబుతుంది. కాని తానే ఆ ఊరు వెళ్ళదు.

## జబ్బుమనిషికి సలహా

జబ్బుమనిషి ఎప్పుడూ ఒంటరిగా ఉండకూడదు. మిత్రులతో మాట్లాడినా ఎక్కువ వాగి వాగి అలిసిపోతాడు. కాబట్టి నర్సు తెచ్చిన మందు తాగడానికి కూడా నీరసపడిపోతాడు.

అందుచేత జబ్బుమనిషి తన మిత్రులను తానే సృష్టించుకోవడం మంచిది. వాళ్ళు పక్కనుంటే డాక్టరు వచ్చినా ధైర్యం పోదు.

దుప్పటి మడతల్లో చాలామంది స్నేహితులను దాచడానికి వీలుంది. వాళ్ళ సైజు ఎక్కువయితే తగ్గించుకోవచ్చు. ఆకారం మాత్రమే ప్రధానం.

ఒకసారి నాకు జబ్బుచేసినప్పుడు తొలిరోజు పారిజాతపు పువ్వులు పెంచాను. దుప్పట్లన్నీ పారిజాతాలతో నిండిపోయాయి.

"పారిజాతపు పువ్వుల్లారా ! పాటలు పాడండి" అన్నాను. అసలే అవి గజ గజ వొణికిపోతున్నాయి. ఆసుపత్రిలోకి వచ్చినందుకు ! నా మొగం, ఇక అవేం పాడుతాయి.

"పారిజాతపు పువ్వుల్లారా ! పారిపొండి" అన్నాను.

ఈసారి వాటిస్థానే ఏనుగుల్ని రమ్మన్నాను. (చిన్న సైజు) అవి తీరుబాటుగా అటూ ఇటూ పచారుచేస్తూంటే నాకెంతో హాయిగావుంది. వాటి చిన్నకళ్ళు నన్నర్థం చేసుకొని పలుకరిస్తే ఎంత బాగుంది, ఎంత బాగుంది !

కాని ఇంతట్లోకే అలుపొచ్చింది. చెప్పొద్దూ, నేను ఉత్త సోమరిపోతుని. కళ్ళుమూసుకొని అటు తిరిగిపోయాను. "దుప్పట్లో కొచ్చి తొండాలను గురించి ఉపన్యాసం ఇవ్వండి, ఊగొడుతూ పడుకుంటాను" అన్నాను.

ఏనుగు లెక్కడేనా మాట్లాడతాయా ? అని ఉపన్యసించలేదు.

కాని ఏ ఉపన్యాసం చెయ్యకపోయినా ఏనుగులు నిన్ను కాపాడుతూవుంటే ఎంత ధైర్యంగా వుంటుంది.

నిశ్చింతగా నిద్రపోయాను.

మూలం : **Henry Michaux** (హెన్రీమిషో)

# వికారి

ఒకనాడు

ఒకనాడు త్వరలో, బహుశా,

ఒకనాడు సముద్రంలో సుదూరాన నా నావను నిలబెట్టిన లంగరు లాగి పారేస్తాను.

ఏమీ కాకపోవటానికి ఏమీ కాకపోవడంతప్ప ఇంకేమీ కాకపోవడానికి కావలసిన సాహసంతో

నన్ను బంధిస్తున్న అన్నింటినీ విసిరి పారేస్తాను.

గొడ్డళ్ళతో కొట్టేస్తాను, తలకిందులు చేస్తాను. ధ్వంసం చేస్తాను, కిందికి దొర్లించేస్తాను.

ఒక్క దెబ్బకి నాలోని వెధవ సిగ్గు, వెధవ స్కీములు, నా సమంజ సత్వపు మందగమనం నాలోంచి చంపివేస్తాను.

ఎవరో ఒకరు కావడమనే కురుపును పిండివేశాక, పుష్టినిచ్చే మహాకాశ జలాలను మళ్ళీ తాగుతాను.

అవివేకాలవల్ల, పరాజయాలవల్ల (పరాజయం అంటే ఏమిటి?) బ్రహ్మాం డాలు బద్దలవడంవల్ల, శూన్యంవల్ల, పూర్తిగా చెడిపోవడంవల్ల, వేళాకోళంవల్ల, ప్రక్షాళనంవల్ల, నా జీవితంలోనుంచి ఎంతో బాగా అంటుకుపోయిన, చక్కగా తీర్చి దిద్దిన, సమీకరించబడిన, నా పరిసరాలకి మిత్రులకీ, ఓహో చాలా యోగ్యులయిన మిత్రులకి, సరిపోయిన స్వరూపాన్ని బహిష్కరించివేస్తాను.

మహోపద్రవం వలె వినమ్రమై, తీవ్ర కలహానంతరంలాగ నేలమట్ట మయిపోయి :

అట్టడుగుకి, నా నిజమైన హోదాకి, ఏ కారణంవల్ల వదిలివేశానో ఇప్పటికీ తెలియని నా ఎందుకూ కొరగాని స్థలానికి దిగిపోయి ;

నిర్లక్ష్యానికీ, యశస్సుకీ పనికిరాకుండా నాశనమైపోయి ; దూరదేశాలలో దారితప్పి (లేదా దారికూడా తప్పక), పేరులేక, అస్తిత్వం లేక ;

వికారినై, అసందర్భాల బురదలో దొర్లుతూ, అందరి వెక్కిరింపులూ అందుకుంటూ, నాపై నేనారోపించుకున్న గొప్పతనానికి విరుద్ధంగా,

వికారినై దమ్మిడి లేకుండా, దమ్మిడి చెయ్యకుండా, అందరికీ అందు బాటులో ఉన్న అనంతమైన అడుగు మనస్సులోకి గెంతేస్తాను :

నమ్మలేని ఒక నవీన తుషారానికి అర్హత పొందుతాను.

బండి సున్నా కావడంవల్ల

ప్రయత్నపూర్వకంగా

పనికిమాలిపోవడంవల్ల

నవ్వులపాలు కావడంవల్ల.

మూలం : **Henry Michaux**

# ప్రొఫెసరు గారి రిపోర్టు

[భూమినుండి మానవజాతి తుడిచిపెట్టుకుపోయిన తర్వాత]

అనగా అనగా ఒక గ్రహం
దానిపేరు భూమి
ఆ గ్రహంమీద ఒక వింత జంతువు
దానిపేరు మానవుడు
మానవుడికి రెండు కాళ్ళుండేవి
రెండు నమ్మకా లుండేవి
ఒకటి అదృష్టం
అన్నీ తనకు అనుకూలంగా సాగినప్పుడు
అలా సాగనప్పుడు
రెండోది నమ్మేవాడు
దాని పేరు మతం
మనిషి వెన్నెముక గల జంతువు
ద్విపాది
సర్వ భక్షకుడు
అకేశి
అన్నట్టు దానికొక ఆత్మ *ఉండేదట
దానికి మరణం లేదట
మానవుడు మస్తుగా తినేవాడు
చెట్లనీ, చేపల్నీ, జంతువుల్నీ, పిట్టల్నీ, నక్షత్రల్నీ
దొరికనవన్నీ పొట్టను పెట్టుకునేవాడు

---

*ఈ 'ఆత్మ' అనే దాని కోసం ఖగోళాంతర పరిశోధక సంఘాలు చాలా కృషిచేశాయి. సమస్త విశ్వాన్ని గాలించాయి. కొన్ని అర్బుదాల అనశ్వరాత్మల కోసం వెదికాయి. ఒక్కటీ కనిపించలేదు. అయితే ఏమాట కామాటే చెప్పుకోవాలి. మానవుడు తనగురించి అబద్ధాలు ప్రచారం చేసేవాడన్న సంగతి అందరికీ తెలుసు.

—ప్రొఫెసర్ టుహాల్స్కి

అప్పుడప్పుడు సాటి మానవులనుకూడా భక్షించేవాడు
కాని ఇది చాలా అరుదు
ప్రతిమానవుడికి ఒక కార్జం
ఒక గుండె ఒక మెదడు ఒక జెండా ఉండేవి
ఇవే వాని ప్రధానాంగాలు
వీటిమీదే వాని బ్రతుకు ఆధారపడింది
అయితే కొందరు లేకపోలేదు
సగం కార్జమే ఉన్నవారు
అసలు గుండెలే లేనివారు
మెదడు లేనివాళ్ళు
కాని జెండా లేని మానవుడా ?
అసంభవం !
చేతనాలలో మానవుడే అత్యంత ప్రముఖ జీవి
వానివల్లనే యుద్ధ పరిశ్రమల్లో
వాటాలకు విలువ పెరిగేది
సైనికుడై సంతోష పూర్వకంగా అతడు
మరణాన్ని వరించేవాడు
లేదా వింతవింత నేరాలు
గొప్పగొప్ప ఖూనీలు చేసేవాడు
అందువల్ల లక్షంకొద్దీ పత్రికలు
అమ్ముడు పోయేవి
మానవ నైజాన్ని అనేకులు మెచ్చుకున్నారు.
కాని అది రెండుగా చీలింది
ఒకటి మగ
ఆలోచించడం అంటే దానికసహ్యం
రెండవది ఆడ
ఆలోచించ నిచ్చారుకాదు ఆడజాతిని
కాని రెంటిజాతుల్లోను ఒక సమానధర్మం ఉంది

అదే భయం
రోగం అంటే భయం
అప్పులంటే భయం
వార్ధక్యం అంటే భయం
ఒంటరితనం అంటే భయం
ఓటమి అంటే భయం
ముఖ్యంగా పొరుగువాడంటే భయం
అందుకే మానవుడు తాను
        "బుద్ధిమంతు" డనుకొనేవాడు
మానవుడు రాజకీయ జీవి
ముఠాలుగా తిరిగేవాడు
ఒక గుంపు ఇంకో గుంపును ద్వేషించేది
అబ్బో ఎన్నెన్ని విద్వేషాలు !
అన్నింటిలో ప్రధానమైనది
దేశాభిమానం
మానవుడికి రెండు చెవులుండేవి కాని
ఏదీ వినిపించుకొనేవాడుకాడు
ఎప్పుడైనా వింటే
వాగ్దానాలూ
వాడి విలువను గూర్చిన అంచనాలూ
అభినందనాలూ
విశేషించి, కృతజ్ఞతా ప్రకటనలూ
ఇవే వినేవాడు
మరికొంద రుండేవారు
విజ్ఞానులు, జిజ్ఞాసువులు, విప్లవ
        కారులు, పైగంబరులు
కాని వీరు అల్పసంఖ్యాకులు
వీళ్ళని పెందరాళే పంపించివేసేవాళ్ళు

సిలువ వేసి
షూట్ చేసి
విషం ఇచ్చి :
మానవులతో బాటు దక్షిణాఫ్రికా
తెల్లజాతి అని ఉండేది
ఇది ఒకంతటగాని అంతం కాలేదు
ఆఖరికి ఇదీ అంతరించింది
వీరిని గురించి తెలుసుకోపడానికేమీ మిగలలేదు
వచ్చేవారం మనం కుక్కల్ని గురించి
ముచ్చటించుకుందాం.

—క్రిష్టోఫర్ లోగ్

# చిన్నపిల్లల సర్కస్‌లో

చిన్నపిల్లల సర్కస్‌లో
ఫిడేళ్ళు ధరించిన వర్తకులు
కష్టాలన్నీ మైమరచిన
కాలం అనేది ఉండేదా ?
గ్రంథాలమీదపడి వాళ్ళేడ్చే
కాలం ఒకటి ఉండేది.
కాలం అయితే వాళ్ళమీదికి
కాష్టాన్నే ఉసికొల్పింది.
ఆకాశపు అర్ధవలయం కింద
ప్రమాదమైన బ్రతుకు వీళ్ళది
అజ్ఞేయం మాత్రమే లోకంలో
అత్యంత సురక్షితమైనది.
ఆకాశపు సంజ్ఞలకింద
హస్తాలు లేనివాళ్ళవే
అతి శుభ్రమైన చేతులు !
గుండెల్లేని శవానికి
గాయాలబాధ లేనట్లు
గుడ్డివాడు మాత్రమే
జాస్తిగా చూస్తాడు.

మూలం : డిలాన్ థామస్

# పిచ్చిదానిమ్మ చెట్టు

తెల్లగా వెల్లవేసిన ఈ వసారాలో
అనుకూల దక్షిణ వాయువులు ప్రసరించే
అందమైన గదుల వెలుపల
ఇట్టే వెలుతురులోకి ఉరికేది
ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా, చెప్పవూ ?
ఉయ్యాలలూగే గాలుల గుసగుసలలో
సారవంతమైన తన సంతోషాన్ని వెదజల్లేది
ఎవరు చెప్పవూ, ఈ పిచ్చి దానిమ్మచెట్టేనా ?
ఉదయవేళ అపుడే తొడిగిన మొగ్గలతో
ఊగుతూ ఉవ్వెత్తుగా తన రంగుల పింఛం విప్పి
విజయగర్వ రోమాంచంతో కులికేది
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా ?
పాలికపు బాలికలు పొలాలలో నగ్నంగా
నిద్రబద్ధకపు లోతులు దులిపేస్తూ
లవంగాలు తమ పసిరిక చేతులతో పోగుచేసేటప్పుడు
చెప్పవూ ఈ పిచ్చిదానిమ్మ చెట్టేనా ?
సూర్యకాంతిని వాళ్ళ తట్టలకెత్తేది ?
వాళ్ళు పిలుచుకునే పేర్లని పాటలతో ముంచెత్తేది ?
చెప్పవూ, ఈ పిచ్చిదానిమ్మచెట్టేనా
ప్రపంచపు నీడలతో పోరాడేది ?
ఈసులాడి దినం తన్ను ఏడు నిగనిగని రెక్కలతో
అలంకరించుకొని
అనంత సూర్యబింబం చుట్టూ ఆకాశ సహస్రాలను
చుడుతున్నప్పుడు
చెప్పవూ ఈ పిచ్చిదానిమ్మ చెట్టేనా
వెయ్యికొరడాలు పుచ్చుకొని
దౌడుతీసే గుర్రాలను జూలులాగి నిలబెడుతుంది ?

ఒకసారి విషాదంతో, ఒకమారు విభ్రమిస్తూ
ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా, చెప్పవూ
ఏదో నవీన ప్రభాతాన్ని ఎలుగెత్తి చాటుతుంది ?
ఓహో చెప్పవూ, ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
సుదూరంలో పరవళ్ళు తొక్కుతూ
వెయ్యి పడవల్ని కడుపుతో ఉన్న కడలిలాగ
ఇతరుల అడుగుజాడ ఎరుగని తీరాలకు
విరగబడే కెరటాలు పంపుతూ
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మచెట్టేనా
ఆకుల పోకెట్ రుమాలు ఊపుతుంది ?
సరికొత్త నిప్పులు చెరుగుతుంది ?
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మచెట్టేనా
తేటతెల్లని గాలికి తెరచాప లెత్తుతుంది ?
నిర్లక్ష్యంగా ప్రమాదకరంగా
ద్రాక్షలతల వినీల శిఖరాలమధ్య
విందులతో వీరావేశంతో
ఎవరు చెప్పవూ, ఈ దానిమ్మ చెట్టేనా
ప్రపంచపు నడుంమీద వెలుతురులో విరుచుకుబడి
రాక్షసి తుపానుల ప్రసారాన్ని ప్రతిఘటించి
చెప్పవూ, ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా
పంటలతో పాటలతో సరిగంచులు దిద్దిన
ప్రత్యూషపు పసుపుపచ్చని సింహపు జూలుపట్టుకొని
దివసకాంత కట్టుకున్న పట్టుచీరని
హఠాత్తుగా జారలాగివేస్తుంది ?
చైత్రమాసపు రవికలు ధరించి శ్రావణమాసపు విపంచి ధ్వనించి
చెప్పవూ ఆడుకునే పాడుకునే ఈవిడ
మనకు మతులు పోగొట్టే ఈవిడ
శిఖరాన్ని పట్టుకొని ఊపేసి

## [illegible]గ్ధ సృష్టి

సూర్యుడి గోలెంలో మత్తెక్కిన పక్షుల్ని వొంపే ఈవిడ
సమస్త వస్తువుల హృదయాలలో
మన ప్రగాఢ స్వప్నాల గుండెలలో
విశాలంగా తన రెక్కలు విప్పుకునే ఈవిడ
ఎవరు ఈ పిచ్చి దానిమ్మ చెట్టేనా ?

(గ్రీకుకవి *ఒడిస్యూస్ ఎలిటిస్* గేయానికి అనువాదం.)

# మరి ముఖ్యంగా ఒక మాఘమాసపు గాలి

మరీ ముఖ్యంగా ఒక మాఘమాసపు గాలి
మంచు వేళ్ళతో నా జుత్తును శిక్షించేటప్పుడు
పీతచేతుల సూర్యుడికి దొరికిపోయి నిప్పులమీద నడుస్తూ నేను
నేలమీద రచించగా ఒక పీతలాంటి నీడని
సముద్రతీరంవార విహంగాల నాద వింటూ
చలికాలపు కట్టెల్లో వింటూ మాలకాకి దగ్గులు
నా తొందరగుండె మాట్లాడుతూ వణుకుతుంది
మాటల నెత్తురు కక్కుతుంది భాషని పూర్తిగా పిండుతుంది

మరిన్ని మాటుమణిగి మాటల ప్రాకారంలో నేను
పరీక్షిస్తాను క్షితిజరేఖమీద చెట్లలా నడుస్తూ
మాటల రూపం ధరించిన మందయానల నెందర్నో
చుక్కల సంజ్ఞలు చేసే చక్కని పిల్లల బారుల్ని చూస్తాను
కొన్ని నీకోసం చెయ్యనిస్తాయి అచ్చుల సరుగుడుచెట్లని పొదల్లో
కొన్ని మర్రిచెట్ల కూతల్ని కొన్నిటి వేళ్ళలోంచి
ముళ్ళ పట్టుశాలు బయల్దేరి మోహనగానం చేస్తాయి
కొన్ని చెయ్యనిస్తాయి నీకోసం మంచినీళ్ళ ఉపన్యాసాలు

గోళెం మొక్కల వెనకాతల ఊగాడే గడియారం
కాలం వాక్కు చెబుతుంది నరాల్లోని అర్థం
ఎగురుతుంది చక్రబాణంమీద-ఊదుతుంది ఉదయాన్ని
కోడి గొంతుకలో పొడిచిన పొద్దు వేడెంతో కొలుస్తుంది
కొన్ని చెయ్యనిస్తాయి నీకోసం మైదానాల సంకేతాలు
హెచ్చరించే పచ్చిక నేను నేర్పినదంతా చెబుతుంది
పురుగు దొలచిన శిశువుతో విరుచుకపడుతుంది కంట్లో
కొన్ని చెయ్యనిస్తాయి నీ కోసం మాలకాకి పాపాలు

మరీ ముఖ్యంగా ఒకానొక మాఘమాసపు గాలి
(కొన్ని చెయ్యనిస్తాయి నీకోసం శరత్కాలపు యజ్ఞాలు
సాలెపురుగు నాలుక వేల్పుకొండ గర్జన)
దుంపల పిడికిళ్ళతో నేలను శిక్షించేటప్పుడు
కొన్ని నీకోసం చెయ్యనిస్తాయి గుండెల్లేని మాటల్ని
నిండుకుంటుంది హృదయం రాసాయనిక రక్తంలో
వల్లెవేస్తూ వర్ణక్రమాలు వచ్చే తుఫాన్ని పసికడుతుంది
సముద్రతీరంవార కాటుక మాటల పిట్టల్ని వింటుంది

మూలం : డిలాన్ థామస్

# చలికాలపు ఉదయం

హేమంతం సూర్యకాంతి ! ఎంతమంచి దివసం !
ఇంకా నిద్రపోతావేం ? ఇది చక్కని ఉదయం !
సఖీ ! సుభగముఖీ, చాలు సిగ్గులేని మగత
ఆవలింత మాను, నిదురకనులు తెరువుసుంత !

ఉత్తర దిగ్గగనంపయి చుక్కలాగ వెలుగుమా
ఉత్తర దిక్ప్రభాత శిఖ నెదుర్కొనుము ప్రియతమా !
నిన్నరాత్రి (నీకు తెలుసు) సుడిగాలుల కేకలో
పొగమంచుల పొరలు క్రమ్మి ఆకాశపు రేకుల్లో
పచ్చని ఒక మచ్చలాగా చందమామ చల్లగా
భయపెట్టే మబ్బుల్లో ప్రయాణించె మెల్లగా
పరితాపపు ప్రతిమలాగ ప్రాణసఖీ నీవు
కూర్చున్నావపుడు, ఇపుడో ? కిటికీ తెరిచి చూడు.

నీలినీలి నింగికింద రంగు తివాసీవలెనే
నీ రెండలలో మిలమిలలాడి సొగసులాడి మంచు
నిద్రిస్తున్నది ! నల్లని వస్తువన్నదే లేదు
చెట్లుమాత్రమే నల్లగ కాస్తకాస్త కనిపించును,
పొగమంచుల మడతలలో ఆకుపచ్చ సరుగుచెట్టు
అల్లదిగో ! మంచుకింద నది కంటున్నది కలలు !

ప్రాణసఖీ గుర్రాన్ని బండికి పిలిపిస్తే
మరీ మంచి దనుకుంటా ప్రయాణాని కిదే అదను.
పదపోదాం ప్రణయినీ ఉష్ణఃకాల హిమనీ మృదు
పథాలలో నీవు నేను, గుర్రపు డెక్కల చప్పుడు
వింటూ, బండి గంటలు వింటూ పోదాం పదపద.
ఎవరులేని ఎవరురాని పొలాలలో తిరుగుదాం
అకురాలి శూన్యమైన అరణ్యాల కరుగుదాం
నాకెంతో సుఖమిచ్చే నదివొడ్డుకు కదులుదాం.

మూలం : అలెగ్జాండర్ పుష్కిన్

# హేమంతం

ఎవరా వస్తున్నది చెట్లమీంచి గాలికాదు
మైదానంమీద దూకు సెలయేళ్ళవి కావు కావు
తన మిహికా సామ్రాజ్యం తనిఖీ చేసేటందుకు
అదిగో హేమంతరాజు కోటవెడలి కదలినాడు
అడవిదార్లు మూసుకపోయాయా లేదా? హిమాని
కడు శ్రద్ధగ తన పని చేస్తున్నదా లేదా? ఈ
ధరణీతలమంతా ఏ యెగుడుదిగుడు లేకుండా
మంచు కప్పి ఉందా అని మరీమరీ చూస్తాడు.
దేకుచెట్లు, తురాయీలు, ఓకుచెట్లు రంగవల్లి
సవరించాయా లేదా? సెలయేళ్ళు పెద్ద నదులు
గడ్డకట్టి సమత్వాన్ని సాధించాయా లేదా?
వస్తున్నా డతడు వృక్షవాటికలం దూగులాడి;
మంచుమీద అతని పదధ్వనులు మీరు వినలేదా?
అతని తెల్లని గడ్డం అదిగో కనబడలేదా?

మూలం: నికొలాయ్ నెక్రసోవ్

వాడి

# వ్లదీమిర్ ఇల్యీచ్ లెనిన్

ఇదే అదను లెనిన్ కథను
రచించెదను నేను
లెనిన్ బ్రతుకు జనంకొరకు
ధ్వనించెదను నేడు
మనోవేదన నాలోన
నశించెననికాదు
విశాలమగు విషాద గుహా
వసించితిని నేడు
లెనిన్ కథాక్రమం సదా
జపించితిని నేను
విషాదాశ్రు తుషారాల
నిషా నాకు లేదు
లెనిన్ నేడు లేడూ ః చూడు
జనంలో ఉన్నాడు
లెనిన్ వేడి లెనిన్ వాడి
జగంనాడి, ధమని
లెనిన్ శాంతి లెనిన్ కాంతి
లెనిన్ మనకు ద్యుమణి
కామ్రేడ్ లెనిన్ ఛత్రం, ప్రేమ
సామ్రాజ్యానికి చిహ్నం,
కామ్రేడ్ లెనిన్ శాస్త్రం, శాత్రవ
దుర్మార్గాల లవిత్రం
లెనిన్ పరాకాష్ఠ లెనిన్
లెనిన్ మన పరాక్రమం
కామ్రేడ్ లెనిన్ ఆయుధం
మన ఆసరా, మన జ్ఞానం
లెనిన్ దృష్టి లెనిన్ సృష్టి
లెనిన్ మన విధానం...

లెనిన్ లెనిన్ లెనిన్ లెనిన్
లెనిన్ మన ప్రమాణం
లెనిన్ మనం మనం లెనిన్
లెనిన్ మనం ప్రయాణం
నీతో నాతో నీతో నాతో
లెనిన్ మహా ప్రవాహం

* *

ప్రజలు నౌకలు
పొడినేల అర్థంకాదు
ఇప్పుడులో జీవిస్తూ మనం
ఈ నౌకను పట్టిన తుప్పుడు విదిలించి
పడవ చెక్కలకి అంటుకున్న
సున్నపు గుల్లలు దుల్లించి
తుప్పు వదిలించి
తుపానులను జయించి
సూర్యకాంతికి సమీపంగా
దించి లంగరు,
నౌకాయాన ప్రయానం
పెరిగిన గడ్డాల నాచు
సముద్రపు చెత్త
పరిహరించి పరిశుభ్రంగా స్నానం చేద్దాం
లెనిన్‌లో స్నానంచేసి
పునీతుణ్ణవుతున్నాను;
విప్లవ సముద్రంలో
ఇంకా ఇంకా దూరానికి
ఈ పడవ నడుపుతున్నాను.
అయినా ఏం కవిత్వం ఇది?
ఆయాయక బాలుడు కావ్యం అంటే
భయపడినట్లు

కారు హారన్ల మ్రోత
విద్యుద్దీపాల కూత
విద్యుద్దీపాల రాత్రి
వెలుతురు జాగరం చేస్తోంది

ఎక్కడనుంచి వచ్చాడు?
ఎవరాయన?
ఏం చేశాడు?
ఏమిటీ జనసమ్మర్దం?
ఎవరి కింత మర్యాద?
జ్ఞాపకాల ఖజానాలోంచి
ఒక్కొక్క మాటనే తీస్తున్నాం.
గొంతుక మాత్రం పెగలదు.
నోటిదాకా వచ్చిన
మాటలు దిగజారుతున్నాయి.
స్తంభించిన శబ్ద ప్రపంచం
మాటల ఫ్యాక్టరీ పని చెయ్యదు.
అతణ్ణి స్పష్టంగా వర్ణించడానికి
అగపడవేం మాటలు?
వారాని కేడురోజులు మనకి
రోజు కిరవై నాలుగు గంటలు
వాడుకో, మానుకో అంతే!
అంతే జీవితం!
హఠాత్తుగా వస్తుంది మృత్యువు
అడక్కుండా తీసుకుపోతుంది.
గడియారాన్ని బద్దలు చేసుకొని
కాలం ప్రవహిస్తే
పంచాంగాల ఆవరణ దాటి
కాలం పరుగెత్తితే
"అహో? అదోశకం" అంటాం!

"ఓహో ! అదోయుగం" అంటాం.
రాత్రిపడగానే నిద్రిస్తాం
పగ లేవో పనులు
నలుపుని తెలుపు చేస్తాం
సోమరితనాన్ని సమర్థిస్తాం !
కాని ఒకానొకడు మనకోసం
చరిత్రగమనాన్ని శాసిస్తే
"వాడుగో ఒక ప్రవక్త" అంటాం
"చూడరా ఒక ప్రతిభాశాలి" అంటాం.
మనం పెద్ద పరుగులకి పోము
పిలవనిదే కదలం
పెళ్ళాలని ప్రేమిస్తాం
స్తబ్దుగా జీవిస్తాం
శరీరం ఆత్మా ఒక్క లయకు
స్పందించే మహాసుభావుడు వస్తే
"క్షత్రవర్చస్వి" అంటాం ;
"దైవ ప్రసాది" అంటాం ;
"వాడెహో మగవా" డంటాం ;
"వాడుకో మొనగా" డంటాం !
అదీ మామూలు పద్ధతి,
తెలిపీ కాదు మూర్ఖంకాదు
అర్థంలేని మాటలు
మంచులా కరిగిపోయే మాటలు.
ఈ నిర్జీవపు గుడ్డలోంచి
భావాలను పొదగలేము
మామూలు ఊహాలతో
మహాత్మ్యాన్ని కొలవలేము,
చేతులూ మెదడూ చాలవు
అతణ్ణి తెలుసుకోవడానికి
ఈ [illegible] శక్తి
ఎవరవి [illegible] !

మూలం : వి. మయకోవ్‌స్కీ